శ్రీ

# వామనచరిత్రము.

బమ్మెర పోతనామాత్య కవీంద్ర ప్రణీతము.

( భాగవతాంతర్గతము—టీకాతాత్పర్యసహితము. )




ప్రకాశకులు

భాగవతుల నృసింహశర్మ గారు.

*Printed and Published by*—

**Bh. N. Sarma,**

*Proprietor:—Sri Rama Press,*

&

*Vegu jukka Grantha mala*

*Padipeddi vari Street*, BERHAMPUR, ( Ganjam Dt, )

**I st. Edition**

**1943-January.**

విలువ రూ. **1-0-0.** ఖర్చులు గాక.

# బ్రహ్మశ్రీయుతులు
# కావ్య వ్యాకరణ తీర్థులునగు విద్వాన్
# శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు.

## శ్రీవామనచరిత్రము—పరిచయవాక్యములు.

ఈ వామనచరిత్రము-శ్రీమదాంధ్రభాగవతములోని ఒక చిన్నభాగము. దీనిని తెలుగునందు పద్యగద్యాత్మకముగా రచించిన ప్రాచీనకవి బమ్మెరపోతనామాత్యుడు 15 వ శతాబ్దిలో మధ్యభాగమున నివసించిన వాఁడు. మహాభక్తాగ్రేసరుఁడుగా ప్రసిద్ధిని గడించినవాఁడు. శ్రీరామచంద్ర పదకమల బంభరాయమానుఁడు. ఆంధ్రదేశమునందలి ప్రజలలో—పోతనకవిని, అతని భాగవతమును, అందలి పద్యరాజములను పఠింపనివాఁడును ఎఱుంగనివాఁడును, వానకు తడవనివాఁడును నాడును నేడును లేడనుట అంద ఱెఱింగినదే.

సంస్కృతమునందు శ్రీమద్భాగవతమును పురాణకోటిలో పరిగణింతురు. దీనిని ఆభాషలో వ్యాసులు రచించిరి. అష్టదశపురాణములని ప్రసిద్ధి గాంచిన వానిలో నిదియు నొక పురాణము. కొందఱు చరిత్రవిమర్శకులు దీనిని సంస్కృతమున రచించినవాఁడు వ్యాసమహర్షిగాక బోపదేవుడనెడి యొక పండితుడనియును అష్టదశపురాణములలోనిదిగా పరిగణింపబడెడి భాగవతము—విష్ణుపారమ్యమును తెల్పెడి యీగ్రంథముగాక దేవీమాహాత్మ్యమునుఅభివర్ణించునట్టి దేవీభాగవతమే అనియు, నందురు. ఆ వివాదము ఇప్పటికిని తెగకయే యున్నది. కాని మనకిచ్చట ఆవివాదముతో నెట్టి సంబంధమును లేదు; గనుక దానిని వదలివైతము.

శ్రీమద్భాగవతమును ఆంధ్రీకరించిన మహాకవి పోతనామాత్యుఁడనిమన మెఱుంగుదుము. ఈయన యింటిపేరు బమ్మెరవారు; 15వ శతాబ్దియందు కవిసార్వభౌముఁడుగా ప్రసిద్ధికెక్కిన శ్రీనాథమహాకవి ఇతనికి బావమఱదియని జనశ్రుతి కలదు. ఈ జనశ్రుతితో బాటుగా పోతనామాత్యుని భక్తిపారమ్యమును పరమేశ్వరాయత్తమైన జీవితవిధానమును గుఱించి అనేకములగు చిత్రవిచిత్రకథలు లోకమునందు నేటికిని వ్యాప్తిలో కలవు. వానియందలి

యథార్థ్యమును గిరిగీచి నట్లు నిర్ణయించుటగాని వానినెల్ల సమన్వయపరచుటగాని, సమ్మతకలుగుండుటకుగాని మనకు సాధ్యముకాదు. పోతనమహాకవియొక్క స్వస్థానము ఏకశిలానగరము అని ఆతనియే భాగవతమున చెప్పికొన్నాడు. కాని విమర్శకులు, ఏకశిలానగరమనునది తెలంగాణ ప్రాంతమునందలి ఓరుగల్లు అని కొందఱును, కడప జిల్లాలోని ఒంటిమిట్ట యని కొందఱును వాదించుకొనిరి. అది ఒక చర్చ. కాని ఏకశిలానగరము ఓరుగల్లు అనుటే న్యాయము.

పోతనామాత్యుడు సంస్కృతమునందలి భాగవతమును రసోచితముగా పెంచి మూలగ్రంథమునకు రెట్టింపుగను మూబ్బడిగను చేసినాడు. ఆంధ్ర భాగవతమును చదువు వారికి అదియొక స్వతంత్రమగు మహాకావ్యముగా తోచునే గాని ఆంధ్రీకరణము అనిపించదు. ఈమహాకవి శ్రీరామచంద్రపాదపద్మారాధకుడు—అని ముందే తెలిపితిని. తన గ్రంథమును నరాంకితముగా నొనర్పక శ్రీరామచంద్రమూర్తికే అంకితము చేసెను. ఈవిషయమును—అనగా గ్రంథమును నరాంకితమునుగా చేయుటలో ఈయనకు గల వైముఖ్యమును—"ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి"—అనే పద్యము స్పష్టీకరించుచున్నది. ఈ పోతనామాత్యుడు అచ్చము ఒక భాగవతమునే కాక వీరభద్రవిజయమనెడి శివపారమ్యమును తెలుపునట్టి ఒక ప్రబంధమును భోగినీ దండకమనుదానిని కూడ రచించెనని అందురు. పోతనామాత్యునకు సహజపాండిత్యబిరుదము కూడ నున్నది.

మహాకవియైన ఈ పోతనామాత్యుల కవితలో శబ్దాలంకారములగు—అనుప్రాస అంత్యానుప్రాస మున్నగునవి తోణుకుచుండును. ఈయన కవిత్వమునందు పదములు అతిసుకుమారరచనలతో నిండి ఇంపు గొల్పుచుండును. శబ్దాలంకారములకు నర్థాలంకారములకు అంతును పొంతును గానరాదు. ఆయారసములకు తగినట్లుగా ఈమహాకవి శైలియును రచనాసంవిధానమును పాత్రపోషణచాతుర్యమును మారిమారి నదీప్రవాహమువలె నిరర్గళముగా ప్రవహించుచుండును. వర్ణ్యములగు పాత్రములు రూపధారణమొనర్చి భావనావీథియందు నాట్యమాడుచున్నట్టులుండును. చదువరులు ఒక్కింత అవధానముతో పరిశీలించినచో ఈయనకుగల అసధారణమగు భావనశక్తి కవితాశక్తులతోపాటుగా ధర్మశాస్త్రములందు గల అపార వైదుష్యమును వెల్లడియగు

చుండును. కాని వాని నుదహరించుట కిది యదను కాదు.

భగవంతుఁడు భక్తపరాధీనుఁడు. తనయొక్క సాత్త్వికవిభవమునకు దోహద మిచ్చు శిష్టులను అనుగ్రహించుటయును అవిభవమునకు హాని కల్గించునట్టి దుష్టులను నిగ్రహించుటయును ఆమహామహునికి నిత్యసిద్ధములు. ఈవామనచరిత్రకథాభాగములో అప్పచెల్లెండ్రును కశ్యపు మహర్షికి భార్యలు నగు దితి—అదితి అనువారియొక్క సంతానములకు గలిగిన నిత్యవైరమును పురస్కరించుకొని దుష్టులగు దైతేయుల బాధనుండి లాగి స్వర్గసామ్రాజ్యమును ఆదితేయులకు శిష్టసాత్త్వికులకు అనుగ్రహించిన విషయము కలదు.

భగవంతుని అవతారములు దుష్టశిక్షణము శిష్టరక్షణము ఆదర్శముగాకలవి అనేకమున్నవి. అందు మత్స్యకూర్మాదులను దశావతారములు ముఖ్యముల యినవి. ఈదశావతారములలో గూడ భగవంతునకు ప్రతికోటిగా నిలచి పోరిన జ్ఞానవీరులు ఎల్లరును సమస్త భువనములకును అందు ప్రాణికోటికిని తన దౌష్ట్యవిధానములవలన నల్లకల్లోలమును, అమితసంక్షోభమును గల్గించి ప్రతీపభక్తిచేత—తొల్త పరమేశ్వరుఁడగు శ్రీమహావిష్ణువు యొక్క ఆగ్రహమునకు పాల్పడినవారే. ఆయనవలన ఉచితదండనము నొంది ముక్తప్రాప్తులై సాలోక్యాదులను పొందినవారలే. కాని సాత్త్వికమార్గమువలంబించి భువనోపకారులై భగవదనుశాసనములను యథావిధిగా నిర్వర్తించి కృతకృత్యులయిన మహానుభావులు దైతేయులలో అరుదు; అరుదు—అనుట ఏల? ఒక్క బలిచక్రవర్తి తప్ప మఱి లేనే లే రనవచ్చును.

దైతేయుడగు బలిమహాచక్రవర్తి; మహాభక్తుఁడు; మహాదాత. వైదిక ప్రబోధితములగు మహాధ్వరములను పెక్కింటిని ఒనర్చినాఁడు. సరసుఁడు; పరమసాత్త్వికుఁడు; మహాశూరుఁడుకూడ. ఇట్టివానిని గెలిచి దేవసామ్రాజ్యమును ఇంద్రునకు కట్టిపెట్ట దలచినాఁడు-మహావిష్ణువు. కాని బలిని సామ్రాజ్యభ్రష్టుని చేయుటకు ఏమి ఉపాయమో?—అని ఎంత ఆలోచించినను, భగవంతునకు ఉపాయమేదియును తోచలేదు. చివఱకు సాత్త్విక పద్ధతికే భగవంతుడు అవతరింపవలసి వచ్చినది. ఒక్క అవతరించుటయేనా? కుబ్జవామనమును నటింపవలసి వచ్చినది. ఆహా! ఏమి బలిమహత్త్వము.

భగవంతుడు షడైశ్వర్యసంపన్నుడు కదా! కావున—ఆయన విధానము

లలో మానవశక్తి దైవశక్తి ఎనట అకించిత్కరము, దుర్భరము. అయినను ప్రపంచసాధారణ దృష్టితోగాని కావ్యపాత్రముల గుణదోషముల చర్చించు దృష్టితోగాని విలాసముగా నెన్నిక చేసి చూచినచో—ఇందలి కథానాయకుడు, వామనుడు; ప్రతినాయకుడు—బలిచక్రవర్తి; మహాదాత. దేవదానవుల నిర్వైరను ఒక్క తెరువున తనపౌరుషముచే నడిపించిన వాడు ఇట్టి నాయకుని లోగొనుటకుగాని మెప్పించుటకుగాని నాయకుడు సైతము దాంభికతను చేపట్టవలసియుండును గదా! ఏమని అడిగినచో —ప్రతినాయకుడు అవలంబించిన విధానముకూడ దాంభికమే! కావుననే నాయకుడిట్టిమార్గము నవలంబించె నందురు.

ఈదృష్టితో మనమీ వామనచరిత్రమును చదివిన యెడల పోతన మహాకవియొక్క పాత్రపోషణము నందలి చమత్కారములు చక్కగా గోచరింపగలవు. ఇందుకు తార్కాణగా వామనుడు బలియొక్క యజ్ఞవాటమున విహరించిన రీతులును చేసిన వాదప్రతివాదములును, సంభాషణ రీతులును చదువరుల కుల్లాసమును, ఆయాఘట్టములందు ఆయారసములకు అనుగుణములయిన భావావేశములును, అనుభవమునకు వచ్చుచుండును. ఇది మెచ్చుగా చేసిన ప్రశంస. చదువరులు తక్కినవానిని స్వయముగా నెఱుంగ గలుదురు కావున నీప్రశంస నింతతో విడిచి పెట్టెదను.

ఇట్టివామనచరిత్రమును నా మిత్రులు భాగవతుల నృసింహశర్మగారు లఘుటిప్పణముతో వెలయించిరి. శ్రీ నృసింహశర్మగారు సంస్కృతాంధ్రముల పేరెన్నిక గాంచిన పాండిత్యము కలవారు. సరసకవితా రచయితలు. తులసీ రామాయణాదులగు పెక్కు గ్రంథములకు కర్తలు. ప్రసిద్ధమయిన వేగుంజుక్క గ్రంథమాల కధిపతులు. ఈ వాక్యములతో ఈపరిచయమును ముగించుచున్నాను.

పం. ఆదినారాయణశాస్త్రి,
బరంపురం.

శ్రీ

# వామనచరిత్రము.

## —:వామనమూర్తిజననము.:—

మ. రవి మధ్యాహ్నమునం జరింప గ్రహతారా చంద్రభద్రస్థితిన్,
శ్రవణద్వాదశినాఁడు శ్రోణ నభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్
భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్
దివిజాధీశ్వరుమాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్. 1

వ. మఱియు నద్దేవుండు శంఖచక్రగదాకమలకలితచతుర్భుజుండును పిశంగవర్ణవస్త్రుండును మకరకుండలమండిత గండభాగుండును శ్రీవత్సవక్షుండును నలినచక్షుండును నిరంతరశ్రీవిరాజిత రోలంబకదంబాలంబితవనమాలికాపరిష్కృతుండును మణికన కాంచితకాంచీవలయాంగద కిరీటహారనూపురాలంకృతుండును గమనీయకంఠ కౌస్తుభాభరణుండును నిఖిలజనమనోహరణుం డును నై యవతరించిన సమయంబున. 2

శా. చింతంబాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరు
ల్సంతోషించిరి సాధ్యచారణమునీశబ్రహ్మవిద్యాధరుల్
కాంతిం జెందిరి భానుచంద్రములు రంగద్గీతవాద్యంబుల
న్గంతు ల్వైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్. 3

వ. తదనంతరంబ.

ఆ. ఈమహానుభావుఁ డెట్టెంతకాలంబు
నుదరమందు నిలిచి యుండె ననుచు
నదితి వెఱఁగు పడియె నానందజయశబ్ద
ములను గశ్యపుండు మొగి నుతించె. 4

వ. అంత నవ్విభుండు సాయుధసాలంకారంబగు తనదివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటునిచందంబున నుపనయన వయస్కుండైన వామనబాలకుండై తల్లిముందటఁ గుమారసముచితాలాపంబులాడుచుఁ గ్రీడించు సమయంబున నదితియుం దనయువిలోకనపరిణామపారవశ్యంబున.

ఆ. నన్నుఁ గన్నతండ్రి నాపాలి దైవమ
నాతపఃఫలంబ నాకుమార
నాదు చిన్ని వడుగ నా కులదీపక
రాఁగదయ్య భాగ్యరాశి వగుచు.

క॥ అన్నా రమ్మని దగ్గఱఁ
జన్నులపా లేఱువాఱ సంశ్లేషిణియై
చిన్నారి మొగము నివురుచుఁ
గన్నారం జూచెఁ గన్నకడుపై యుంటన్.

క. పురుడీ బోటికి నిందిర
పురు డంబిక గాక యొరులు పురుడే యనుచుం
బురుటాలికిఁ బదిదినములు
పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపుగరితల్.

వ. అంత నబ్బాలునకు సంతసంబున మహర్షులు గశ్యప ప్రజాపతిం బురస్కరించుకొని సముచితోపనయన కర్మ కలాపంబులు సేయించిరి సవిత సావిత్రి నుపదేశించె బృహస్పతి యజ్ఞోప వీతంబును గశ్యపుండు ముంజియుఁ గౌపీనం బదితియు ధరణి కృష్ణాజినంబును దండంబు వనస్పతి యగుసోముండును గగనా ధిష్ఠానదేవత ఛత్త్రింబును గమండలువు బ్రహ్మయు సరస్వతి యక్షమాలికయు సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి మఱియు

క. భిక్షాపాత్రిక నిచ్చెను
యక్షేశుఁడు వామనునకు నక్షయమనుచున్
సాక్షాత్కరించి పెట్టెను
భిక్షునకు భవాని పూర్ణ భిక్ష నరేంద్రా. 10

క. శుద్ధ బ్రహ్మర్షి సమా
రాధ్యుండై విహితమంత్రరాజిఁ జదువుచుం
బోద్ధం బగు ననలంబున
వృద్ధాచారమున వటుఁడు వేల్చెం గడఁకన్. 11

—బలిచక్రవర్తి కడకు వామనమూర్తి యేతెంచుట—

వ. ఇట్లు కృతకృత్యుండైన మాయామాణవకుండు దేశాంతర సమా
గతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె. 12

క॥ వత్తురె విప్రులు వేఁడఁగ
నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం
దెత్తురె మీరును సంపద
లిత్తెఱఁగున దానవీరుఁడెవ్వఁడో చెప్పుఁడా. 13

వ. అనిన నఖిల దేశీయులగు భూసురు లిట్లనిరి. 14

మ. కలరున్ దాతలు నిత్తురున్ ధనములుం గామ్యార్థముల్ గొంచు వి
ప్రులు నేతెంతురుగాని యీవిని బలింబోలన్ వదాన్యుండు లేఁ
డలఘుండై యొనరించె నధ్వరశతం బా భార్గవానుజ్ఞచే
బలి వేఁడంబడయంగవచ్చు బహుసంపల్లాభముల్ వామనా. 15

వ. అని తెలియం జెప్పిన బ్రాహ్మణుల వచనంబు లాలకించి

లోకంబులకుం బ్రీతి పుట్టింపఁ బయనంబై లాభవచనంబులు గై
కొనుచుఁ దల్లిదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదలి. 16

క. పరిక్షీణ దివిజ వల్లభ
రక్షాపరతంత్రుఁడగుచు రాజీవాక్షుం
డాక్షణమున బలియింటికి
భిక్షాగమనంబు సేసెఁ బేదరికముతోన్. 17

క॥ హరిహరి సిరి యురమునఁ గల
హరి హరి హయుకొఱకు దనుజు నడుగం జనియెం
బరహితరతిమతియుతులగు
దొరలకు నడుగుటలు నొడలితొడవగుఁ బుడమిన్. 18

క. శర్మద యమదండక్షత
వర్మద నతికఠినముక్తి వనితాచేతో
మర్మద నంబునివారిత
దుర్మద నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుఁడున్. 19

వ. దాఁటి తత్ప్రవాహంబున కుత్తర తటంబునందు.

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె బహుధాజల్పన్నిశాటంబు ను
ద్దండాహూతమునీభ్యబిభ్యదమృతాంధస్సిద్ధకూటంబు వే
దండాశ్వధ్వజనీకవాటము మహోద్యద్ధూమసంఛన్న మా
ర్తండసంద్యనఘోటమున్ బలిమఖాంతర్వేదికావాటమున్. 20

వ. కని దానవేంద్రుని హయమేధవాటి దఱియం జొచ్చు
నయ్యవసరంబున. 21

శా. శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వహ్నియో
దంభాకారత వచ్చెఁ గాక ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁ డీ
శుంభద్ద్యోతనుఁ డీ మనోజ్ఞతనుఁ డంచున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబుగన్. 22

క॥ గుజగుజలు వోవువారును
గజబిజిఁ బడువారుఁ జాలఁ గలకలపడుచున్
గజబిజి యైరి సభాస్థలిఁ
బ్రిజలెల్లను బొట్టివడుగుఁ బాపనిరాకన్. 23

వ. ఆసమయంబున బలి సభామండపంబుఁ దఱియుం జొచ్చి. 24

సీ॥ చవులుగాఁ జెవులకు సామగానంబులు
సజువు నుద్గాతల చదువు వినుచు
మంత్రతంత్రార్థ సంబంధభావములు పే
ర్కొనెడి హోతలతోడఁ గూడికొనుచు
హోమకుండంబులం దున్న త్రేతాగ్నుల
వెలిగించు యాజకవితతిఁ గనుచు
దక్షులై బహువిధాధ్వరవిధానంబులు
సెప్పెడి సభ్యులఁ జేరఁ జనుచుఁ

తే. బెట్టు గోరెదు వేడుక వట్టుపఱుచు
నదితిపుట్టువు లచ్చికి నాటపట్టు
గోరి చరియించె సభలోనఁ గొంతదడవు
పుట్టు వెన్నఁడు నెఱుఁగని పొట్టివడుగు. 25

వ. మఱియును. 26

క॥ వెఱచుచు వంగుచు వ్రాలుచు
నఱిముఱి గుబురులకుఁ జనుచు హరి హరి యనుచున్
మఱుగుచు మలుకుచు దిరదిర
గుఱుమట్టపుఁబొట్టివడుగు గొంత నటించెన్. 27

క॥ కొందఱతోఁ జర్చించును
గొందఱతో జటలు సెప్పి గోష్ఠిం జేయుం
గొందఱతోఁ దర్కించును
గొందఱతో ముచ్చటాడుఁ గొందఱ నవ్వున్. 28

వ. మఱియు ననేకవిధంబుల నందఱకు నన్నిరూపులై వినోదించుచు. 29

క॥ నెడనెడనడకలు నడచుచు
నెడనెడ నడుగిడఁగ నదరి యిల దిగఁబడఁగాఁ
బుడిబుడి నొడువులు నొడువుచు
జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్. 30

వ. ఇట్లు డగ్గఱి మాయాభిక్షుకుండు రక్షోవల్లభుం జూచియిట్లనియె. 31

మ॥ ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్నికాలాది ది
క్పతిగర్వాపనయప్రవర్తి గతలోభస్ఫూర్తి నానామఖ
ప్రతిదాన ప్రవణానువర్తి సుమనోరామామనో భేదనో
ద్ధతచంద్రాంతపకీర్తి సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి దాన్. 32

వ. అని కుశపత్రాక్షతసంయుతంబగు దక్షిణహస్తంబు సాఁచి యిట్లనియె. 33

ఉ॥ స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తకు హాసమాత్ర వి
ధ్వస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వరవిధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్. 34

వ. అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశి
యునుంబోలె ముందట నకుటిలుండును జటిలుండును సచ్ఛ
త్రుండును సక్షాలంబిత భిక్షాపాత్రుండును సరకలిత జలక
మండలుండును మనోహర వదనచంద్రమండలుండును మా
యావాదనటుండును నగు వటువుం గని దినకర కిరణ పిహి
తంబులైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులు
గూర్చున్నయెడల లేచి సేమంబడిగి తియ్యనిమాటల నాదరించిరి
బలియును నమస్కరించి తగిన గద్దియ నునిచి పాదంబులుదుడిచి
తన ప్రాణవల్లభ పసిండిగిండి నుదకంబులు వోయ వడుగుం
గొమరునిచరణంబులు గడిగి తడియొత్తి తత్సమయంబున. 35

ఆ॥ వటునిపాదశౌచవారి శిరంబునఁ
బరమభద్ర మనుచు బలి వహించె
నేజలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ
దేవుఁ డుద్వహించె ధృతి శిరమున. 36

వ. మఱియు నయ్యజమానుం డభాగ్యతుఁ డిట్లనియె. 37

మ॥ వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్యది
య్యెడకు న్నీవరుదెంచుటన్సఫల మయ్యెన్వంశ ముజ్జ్వలముం
గడు ధన్యాత్ముఁడ నైతి నీమఖము యోగ్యం బయ్యె నాకోరికల్
గడతేఱెన్ సుహుతంబు లయ్యె శిఖులుం గల్యాణ మిక్కాలమున్ 38

మ॥ వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండము కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా. 39

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికినవైరోచని వచనంబులు విని సంతో
షించి యీశ్వరుండి ట్లనియె. 40

సీ॥ ఇది నాకు నెల వని యేరీతిఁ బలుకుదు
నొక చోటనక యెందు నుండనేర్తు
నెవ్వనివాఁడ నంచేమని పలుకుదు
నాయంతవాఁడనై నడవనేర్తు
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు ననియేల చెప్పంగ
నేరుపు లన్నియు నేన నేర్తు

ఆ. నొరులు గారు నాకు నొరులకు నే నాదు
నొంటివాఁడఁ జుట్టమొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లిగలదు చెప్పెద నావెంకి
సుజనులందుఁ దఱచు సొచ్చియుందు. 41

వ. అది యట్లుండ నిమ్ము. 42

సీ॥ జననాథ నీమాట సత్యంబు సత్కీర్తి
దంబుఁ గులార్హంబు ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనతత్వమూర్తులు
గాని మీకులమందుఁ గలుగ రొరులు
రణభీరువులు వితరణభీరువులు లేరు
ప్రత్యర్థు లర్థులు ప్రబ్బికొనిన
దానశౌండిమమునఁ దనుపుదు రధికులై
మీ తాత లందఱు మేటిమగలు

ఆ. మీకులంబునందు మెఱయు బ్రహ్మాండము
మింటిచంద్రుమాడ్కి మేలిరుచులఁ
బవిత్రకీర్తితోడ భవదీయవంశంబు
నీరరాశిభంగి నెగడుచుండు. 43

క. ఆతురభూసురగతిఁ బురు
హూతాదులు దన్ను వేఁడ దగఁ గొంటెనుచున్
మీతండ్రి యిచ్చె నాయువు
నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్. 44

క. ఏలితివి మూఁడు జగములుఁ
దోలితి వింద్రాది సురులఁ దొల్లిటివారిం
బోలితివి దానగుణముల
నోలితివి పిశాచరాక్షసుల రక్షింపన్. 45

క. రాజ్యంబు కలిగెనేనిని
బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్
భాజ్యముగ బ్రతుకఁ డేనిం
ద్యాజ్యంబులు వాని జన్మధగేహంబుల్. 46

క. మున్నెన్నుదురు వదాన్యుల
నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచున్
ఇన్ని దినంబులనుండియు
నెన్నఁడు నినుఁ బెట్టుమనుచు నింద్రము సేయన్ 47

ఆ. ఒంటివాఁడ నాకు నొకటిరెండడుగుల
మేరయిమ్ము సొమ్ము మేర యొల్లఁ
గోర్కి దీఱ బ్రహ్మకోటి ముట్టెద
దానకుతుకసాంద్ర దానవేంద్ర. 48

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె.

ఆ. ఉన్నమాట లెల్ల నొప్పును విప్రేంద్ర
సత్యగతులు వృద్ధ సమ్మతంబు
లడుగఁ దలఁచి కొంచె మడిగితి వోచెల్ల
దాతపెంపు సొంపుఁ దలఁపవలదె. 49

మ. వసుధాఖండము వేఁడితో గజములన్ వాంఛించితో వాజులన్
వెసనూహించితొ కోరితో యువతులన్ వీక్షించికాంక్షించితో
పసిబాలుండవు నేరవీ వడుగ నీభాగ్యంబు లీపాటి గా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీనేర్చునే. 50

వ. అనిన మొగంబునం జిఱునగవు మొలకలెత్త గృహమేధికి మేధావి యిట్లనియె.

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూములెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదాకాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవకిచ్చుటది బ్రహ్మాండంబు నాపాలికిన్. 51

వ. అదియునుంగాక.

క. వ్యాప్తింబొందక వగవక
ప్రాప్తం బగు లేశమైనఁ బదివేలనుచుం
దృప్తిం జెందనిమనుజుఁడు
సప్తద్వీపముల నైనఁ జక్కంబడునే. 52

శా. ఆశాపాశము దాఁగడున్నిడుపు లేదంతంబు రాజేంద్ర! వా
రాశి ప్రావృతమేదినీవలయసామ్రాజ్యంబు ప్రాప్తించియున్
గాసింబొందిరి గాక వైన్యగయ భూకాంతాదులున్నర్థకా
మాశం బాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులంజూచిరే? 53

సీ. సంతుష్టుఁడీమూఁడు జగములఁ బూజ్యుండు
సంతోషి కెప్పుడు జరుగు సుఖము

సంతోషిగాకుంట సంసారహేతువు
సంతసంబున ముక్తి సతియు దొరకుఁ
జూటఁ పూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ
తుష్టిని దేజంబు దోన పెరుఁగుఁ
బరితోషహీనతఁ బ్రభ చెడి పోవును
జలధార ననలంబు సమయునట్లు

ఆ. నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట
దగవుగాదు నాకుఁ దగినకొలఁది
యేను వేఁడికొనిన యీపదత్రయమును
జాలదనక యిమ్ము చాలుఁ జాలు. 54

వ. అని యిట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీదానంబు సేయఁదలం
చి కరకలిత సలిల కలశుండైన యవ్విరోచనపౌత్రుని గని
నిజవిచార యుక్తుఁ దనుజ రాజ్యచక్రుం డగు శుక్రుండిట్లనియె. 55

సీ. దనుజేంద్ర యీతఁడు ధరణీసురుఁడు గాఁడు
దేవకార్యంబు సాధించు కొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితి గర్భంబునఁ
గశ్యపసూనుఁడై కలిగినాఁడు
ఎఱుఁగ వీతనికోర్కి నిచ్చెద నంటివి,
దైత్య సంతతి కుపద్రవము వచ్చె
నీలక్ష్మిఁ దేజంబు నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చుఁ దా వాసవునకు

ఆ॥ మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల
నఖిలకాయుఁ డగుచు నాక్రమించు
సర్వధనము విష్ణుసంవర్జనము సేసి
బదుకుపగిది నెట్లుబ్రదికె దీవు. 56

సీ॥ అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో
నన్నృతంబు గాదు లేదనిన నధిప
యాత్మవృక్షము మూల మనృతంబు నిశ్చయ
మనృత మూలము గల్గ నాత్మ సెడదు
పుష్పఫలము లాత్మ భూజంబునకు సత్య
మాత్రమాను బ్రతుకమి నదియుఁ జెడును
ఫలపుష్పములు లేక పసచెడు వృక్షంబు
మూలంబుతో వృద్ధిఁబొందఁ గాదె

గీ॥ చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ జెందకుండ
నిచ్చుపురుషుఁడుఁ జెడకుండు నిద్ధచరిత
కాక యంచిత సత్య సంగతి యటంచు
నిజధనం బర్థి కిచ్చిన నీకు లేను. 57

ఆ॥ వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణ విత్త మాన భంగమందుఁ
జకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము పొంద దధిప. 58

మ॥ కులమున్ రాజ్యముఁ దేజమున్నిలుపుమీ కుబ్జుండు విశ్వంభరుం
డలఁతిం బోఁడు త్రివిక్రమస్ఫురణ వాఁడై నిండు బ్రహ్మాండమున్
గలఁడే మాన్ప నొకండు నాపలుకు లాకర్ణింపు కర్ణంబులన్
వలదీ దానము గీనముం బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా. 59

వ. అని యిట్లు హితంబుఁ బలుకుచున్న కులాచార్యునకు క్షణ
మాత్ర నిమీలిత లోచనుండయి యశస్వి యిట్లనియె. 60

క॥ ధాత్రిని హాలికునకును, సు
క్షేత్రము బీజములు నొకటఁ జేకుఱు భంగిం

జిత్రముగ దాత కీవియుఁ
బాత్రము సమకూరునట్టి భాగ్యముగలదే? 61

శా॥ కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరి మూటఁ గట్టికొని పోవం జాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా! 62

క॥ ఉడుగని క్రతువులఁ దపములఁ
బొడగనఁ జననట్టి పొడవు పొడువునఁ గుఱుచై
యడిగెడినఁట నను బోఁటికి
నిడరాదె మహానుభావ యిష్టార్థంబుల్. 63

శా॥ ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁదై నాకరంబుట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే. 64

మ॥ నిరయం బైన నిబద్ధమైన ధరణీ నిర్మూలనం బైన దు
ర్మరణం బైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరి యైనన్ హరుఁడైన నీరజభవుం డభ్యాగతుం డైననౌఁ
దిరుగ న్నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్. 65

ఆ॥ నోడివినంతపట్టు నుసలక యిచ్చుచో
నేలకట్టు విష్ణుఁ జేటిమాట
గట్టెనేనిఁ దాన కరుణించి విడుచును
విడువకుండ నిమ్ము విమలచరిత. 66

క॥ మేరువు తలక్రిందైనను
పారావారంబు లింకఁబాఱిన లోలో
ధారుణి రజమై పోయినఁ
దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్. 67

మత్తకోకిలము. ఎన్నఁడుంబరు వేఁడఁబోఁడట యేకలంబుఁట కన్నవా
రన్నదమ్ములు నైన లేరఁట యన్ని విద్యల మూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రౌఢ గుజ్జఁట చేతులొగ్గి వసింప నీ
చిన్ని పాపనిఁ ద్రోసి పుచ్చఁగఁ జిత్త మొల్లదు సత్తమా! 68

వ. అని యిట్లు సత్యపదవీ ప్రమాణ తత్పరుండును, వితరణకుతూహల సత్త్వరుండును, విమలయశస్కుండును, దృఢమనస్కుండును నియత సత్యసాధుండును సద్విజకమల కమలబంధుండును నైన బలిం జూచి శుక్రుండు కోపించి మదీయ శాసనంబతిక్రమించుటం జేసి శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శపియించిన, బలియును గురుశాపతప్తుండయ్యు ననృతమార్గంబున కభిముఖుండు గాకుండె నప్పుడు. 69

ఆ॥ బ్రతుకవచ్చుఁగాక బహుబంధనము లైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనము లైనఁ జెడుఁగాక పడుఁగాక
మాటఁదిరుగ లేరు మానధనులు. 70

వ. అయ్యవసరంబున. 71

ఆ॥ దనుజలోక నాథుదయిత వింధ్యావళి
రాజ వదన మదమరాళ గమన
వటుని కాళ్ళు గడుగ వర హేమఘటమున
జలముఁ దెచ్చె భర్త సన్న యెఱిఁగి. 72

వ. అయ్యవసరంబునఁ గపటవటునకు నద్దానవేంద్రుండిట్లనియె. 73

క॥ రమ్మా మాణవకోత్తమ
లెమ్మా నీవాంఛితంబు లేదన కిత్తుం
డెమ్మా యడుగుల సిటురా
నిమ్మా కడుఁగంగ వలయు నేటికిఁ దడయున్. 74

వ. అనిన విని 75

మ. బలి దైత్యేంద్ర కరద్వయీ కృతజల ప్రక్షాళన వ్యాప్తికిన్
జలజాక్షుఁడు సాఁచె యోగి సుమన స్సంప్రార్థిత శ్రీదముం
గలితా నమ్ర రమా లలాట పదవీ కస్తూరికా శాదముం
నలినామోదము రత్ననూపురిత నానా వేదముం బాదమున్. 76

క॥ సురలోక సముద్ధరణము
నిరత శ్రీకరణ మఖిల నిగమాంతాలం
కరణము భవసంహరణము
హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్ 77

వ. ఇట్లు ధరణీసుర దక్షిణ చరణ ప్రక్షాళనంబు చేసి వామపాదంబు
గడిగి, తత్పావనజలంబు శిరంబునంజల్లుకొని వార్చి దేశకాలాది
పరిగణనంబు చేసి. 78

శా॥ విప్రాయ ప్రకట వ్రతాయ భవతే విష్ణు స్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాద ధరణిం దాస్యామి యంచుం గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుంజే సాఁచి పూజించి బ్ర
హ్మ ప్రీతమ్మని ధార వోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్. 79

వ. తత్కాలంబున. 80

ఆ॥ నీరధారఁ బడఁగనీక యడ్డంబుగాఁ
కలశరంధ్ర మాఁపఁగాను దెలిసి
హరియుఁ గావ్య నేత్రమటఁ గుశాగ్రంబున
నడువ నేకనేత్రుఁ డయ్యె నతఁడు. 81

మ. అమరారాతి కరాక్షరోజ్ఝిత పవిత్రాంభః కణ శ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డె ఖండిత దివౌక స్స్వామి జిహ్మస్త్రమున్
గమలాకర్షణ సుప్రశస్తము రమా కాంతాలకాపాస్తమున్
విమత శ్రీకుచశాత చూచుకతటీ విన్యస్తమున్ హస్తమున్. 82

క॥ మునిజన నియమాధారను
జనితాసురయువతి నేత్ర జలకణధారన్
దనుజేంద్ర నిరాధారను
వనజాక్షుఁడు గొనియె బలి వివర్జిత ధారన్. 83

ఆ॥ కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రుమాట లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్రమనుచు నిచ్చె దానము బలి
మహివదాన్యుఁడొకఁడు మఱియుఁగలఁడె? 84

క॥ బలి సేసిన దానమునకు
వలినాక్షుఁడు నిఖిల భూతనాయకుఁ డగుటం
గలకల మని దశ దిక్కులు
బళిబళి యని పొగడె భూతపంచక మనఘా! 85

క॥ క్షితిదాన మిచ్చు నతఁడును
నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును మరిత

చ్యుతులై శతవత్సరములు
శతమఖలోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్. 86

వ. అట్లు గావున నేదానంబును భూదానంబునకు సదృశంబు గానే రదు; గావున వసుంధరాదానం బిచ్చితి వుభయలోకంబులం గీర్తి సుకృతంబులు వడయు మని పలికి యమ్మాయా వటుండి ట్లనియె. 87

క॥ ఇది యేమి వేఁడితని నీ
మదివగవక ధారవోయుమా సత్యము పెం
పొదవఁగఁ గోరిన యర్థం
బిడి యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 88

వ. అని పలికిన వటుని పలుకులకు హర్ష నిర్భర చేతస్కుండై వైరోచనుండు 89

ఆ॥ పుట్టినేర్పు కానెనో ? పుట్టక నేర్చెనో
చిట్టి బుద్ధు లిట్టి పొట్టినడుగు
పొట్టనున్న వెల్ల బూమెలు నని నవ్వె
నెలమి ధరణి దాన మిచ్చె నపుడు. 90

—:వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట:—

ఆ॥ గ్రహ మునీంద్ర సిద్ధ గంధర్వ కిన్నర
యక్ష పక్షి దేవ తాహిపతులు
పొగడి రతని పెంపుఁ బుష్పవర్షంబులు
గురిసె దేవతూర్యకోటి మొరసె. 91

వ. ఇట్లు ధారా ప్రతిగ్రహంబు సేసి. 92

శా॥ ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై. 93

మ రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్వస్త్రమై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్. 94

వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకం బగు విశ్వరూపంబవ ధరించి నభంబును, దివంబును భువనంబును దిశలును సముద్రంబులును చల దచల దఖిల భూత నివహంబులుం దానయై యేకీభవించి క్రమంబున భూలోకంబునకుంబొడవై, భువర్లోకంబు నతిక్రమించి సువర్లోకంబును దలకడచి, మహర్లోకంబు దాఁటి, జనోలోకంబునకు మీఁదై, తపంబునకు నుచ్ఛ్రితుండై సత్యలోకంబు కంటె నౌన్నత్యంబు వహించి యెడ లిఱుములు సంధులు రంధ్రంబులు లేకుండనిండి మహాదేహమహితుండై, చరణతలంబున, రసాతలంబును, పాదంబుల మహియును, జంఘలమహీధ్రంబులును, జానువులం బతత్త్రి సముదయంబులును, ఊరువుల నింద్రసేన మరుద్గణంబులును స్కంధంబున సంధ్యయు మనంబునఁ జంద్రుండును, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబునం దనుజులును నాభిని నభంబును, ఉదరంబున నుదధి సప్తకంబును ఉరంబున దారకా నికరంబును ఉరోజంబుల ఋతుషట్కంబును హృదయంబున ధర్మంబును వక్షంబున గమలహస్తయగు లక్ష్మియు కంఠంబున వేదంబులును, భుజంబులం బురందరాది దేవతలును గర్ణంబుల దిశలును, శిరంబున నాకంబును, శిరోజంబుల మేఘం

బులును, నాసాపుటంబున వాయువులును, నయనంబుల సూర్యు లును, వదనంబున వహ్నియు, వాణి నఖిలఛందస్సముదయం బును, పృష్ఠంబున నధర్మంబును, రసనంబున జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రం బులును, లలాటంబునఁ గోపంబును, అధరంబున లోభంబును స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, క్రమణంబున యజ్ఞంబును, ఛాయవలన మృత్యువును, నగవువలన ననేకమా యావిశేషంబులును, రోమంబులనోషధులును, నాడీప్రదేశం బుల నదులును నఖంబుల శిలలును బుద్ధి నజుండును, ప్రాణంబుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమస్థావరజంతు సంఘం బులునుగలవాఁడై, జలధరనినద శంఖ శార్ఙ్గసుదర్శనగదాదండ ఖడ్గాక్షయ బాణతూణీర విభ్రాజితుండును మకరకుండలకేయూ రహారకటక కంకణకౌస్తుభమణి మేఖలాంబర వనమాలికా వి రాజితుండును సునందనంద జయ విజయ ప్రముఖ పరిచర వా హినీ సందోహ పరివృతుం డగుచు, అసమాన తేజోవిలసితుండును నై బ్రహ్మాండంబు వనమేనికప్పు తెఱుంగున నుండ విజృంభించి. 95

మ॥ ఒక పాదంబున భూమిఁ గప్పి దివి వేఱొంటన్ నిరోధించియుం
డొకటన్ మీఁది జగంబు లెల్ల వడి నొండెంటన్ విలంఘించి ప
ట్టక బ్రహ్మాండ కటాహముం బెటిలి వేండ్రంబై పగుల్ గాన రా
నొకఁడై వాఁడ్రు గలభ్యుఁడై హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్. 96

ఆ॥ ఒకపదంబు క్రింద నుర్వి పద్మము నంటి
కొన్నకంకలవము కొమరుఁదాల్చె
నొకటి మీఁద దమ్మి కొదిఁగిన తేటినా
వెలసె మిన్ను నృప త్రివిక్రమమున. 97

వ. తత్సమయంబున. 98

ఆ॥ జగము లెల్ల దాఁటి చనిన త్రివిక్రము
చరణ నఖర చంద్ర చంద్రికలను
బొనుఁగు పడియె సత్యమున బ్రహ్మ తేజంబు
దివసకరుని రుచుల దివియ భంగి. 99

సీ॥ భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ
గాపురంబులు సేయు ఘనులు రాజ
లా మరీచ్యాదులు నాసనందాదులు
నాదివ్యయోగీంద్రు లచటనెపుడు
మూర్తిమతంబులై మ్రోయు పురాణత
ర్కామ్నాయ నియమేతిహాసధర్మ
సంహితాదులు గురు జ్ఞానాగ్ని నిర్దగ్ధ
కర్ములై మఱియును గలుగునట్టి

ఆ॥ వారలెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు
నంఘ్రిఁజూచి మ్రొక్కి రధికభక్తిఁ
దమ మనంబులందుఁ దలఁచు నిధానంబుఁ
గంటి మనుచు నేడు మంటి మనుచు. 100

మ॥ తనపుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభి పంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నతపదంబుం జూచి తత్పాదసే
చనముం జేసెఁ గమండలూదకమునుం జల్లించి తత్తోయముల్
వినువీధిం బ్రవహించె దేవనదియై విశ్వాత్మకీర్తి ప్రథన్. 101

వ. తత్సమయంబున. 102

సీ॥ యోగమార్గంబుల నూహించి బహువిధ
పుష్పదామంబులఁ బూజసేసి
దివ్యగంధంబులు దెచ్చి సమర్పించి
ధూపదీపముల దో డ్తోడ నిచ్చి
భూరి లాజాక్షతంబులు సల్లి ఫలములు
గానుక లిచ్చి రాగములఁ బాడి
శంఖాది రవముల జయఘోషములుసేసి
కరుణాంబునిధి త్రివిక్రమ యటంచు.

ఆ॥ బ్రహ్మమొదలు లోకపాలురు గొనియాడి
రెల్లదిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁడరిగి చాటె భేరీధ్వని
వెలయఁజేసి విష్ణు విజయమనుచు. 103

క॥ అన్నిజగంబులు దానై
యున్నజగన్నాథుఁజూచి యోగిభావింపం
గన్నందక మనమందక
సన్నుతులంజేసిరపుడు సభ్యులు బళియున్. 104

వ. అంత నొయ్యనఁ బూర్వప్రకారంబున నున్న వామనునింగని పద త్రయవ్యాజంబున నితండు సకల మహీమండలంబు నాక్రమించెఁ గపటవటు రూపతి రోహితుండగు విష్ణుండని యెఱుంగక మన దానవేంద్రుండు సత్యసంధుండు గావున మాట దిరుగక యిచ్చె నతని వలన నేరంబులేదీ కుబ్జుండప్రతిహత తేజః ప్రభావంబున నిజ్జగంబులఁబరిగ్రహించి వాసవునకు నీయఁదలంచియున్న వాఁడీ వామనునింబోవనీక నిర్జించుటకర్జంబని గర్జనగర్జనంబులు చేయుచు వజ్రాయుధ మరుజ్జేతలగు విప్రచిత్తి రాహుహేతి ముఖ్యులైన

రక్కసులుక్కుమిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరశుపట్టిస భల్లాది సాధనంబులు ధరియించి కసిమసంగి ముసరికొని దశదిశలం బ్రసరించినంజూచి హరిపరిచరులగు సునందనంద జయజయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్వతులను దండనాథు లయుతవేదండ సమబలులై తమతమయూథంబుల నాయుధంబులతోఁ గూడుకొని దానవానీకంబులం బరలోకంబున కనుపువారైయుండ వారలెదుర్కొని బరవసంబు సేయుచున్నంగనుంగొని శుక్రశాపంబుందలంచి దనుజవల్లభుండిట్లనియె. 105

సీ॥ రాక్షసోత్తములార రండు పోరాదక
కాలంబు గాదిది కలహమునకు
సకలభూతములకు సంపదాపదలకు
బ్రభువైన దైవంబు పరభవింప
మనచేఁపుడుమే తొల్లి మనకు రాజ్యంబును
సురలకు నాశంబు సొరిదినిచ్చి
విపరీతముగఁజేయు వేల్పు నేమందము
మనపాలిభాగ్యంబు మహిమగాక.

గీ॥ వెఱచి పలుమారుపాఱెడి విష్ణుభటులు
మిమ్ముఁగెలుచుట దైవంబు మేరకాదె
మనకునెన్నండు దైవంబు మంచిదగును
నాడుగెలుతము వగవారి నేడు వలదు. 106

వ. అదియునుగాక. 107

క॥ బలుదుర్గంబులు సచివులు
బలములు మంత్రౌషధములు బహుకోశముషియుం

గలిగియు సామోపాయం
బుల కాలంబెఱిఁగి నృపుఁడు పోరాటమొప్పన్. 108

వ. అట్లుగావున రణంబున కిప్పుడు శత్రులమోహరించుట కార్యం
బు గాదు - మనకునుందగు కాలంబున జయింతము నలంగకఁ
దలంగుండనినఁ దలంగి భాగవత భటభీతులయి చిక్కరక్కసులు
రసాతలంబు నకుం జనిరప్పుడు హరి హృదయం బెఱింగి తార్క్ష్య
నందనుండు యాగ్యసుత్యాహంబున వారుణ పాశంబుల నసుర
వల్లభుని బంధించె నంత. 109

క॥ బాహులు పదములు గట్టిన
శ్రీహరి కృపగాక యేమి సేయుదునని సం
దేహింపక బలి నిలిచెను
హాహారవ మెసఁగె దశ దిగంతము లందున్. 110

క॥ సంపద చెడియును దైన్యముఁ
గంపంబును లేకఁ దొంటి కంటెం బెంపుం
బెంపును నెఱుకయు ధైర్యము
వంపని సురవైరిఁజూచి వటుఁడిట్లనియెన్. 111

సీ॥ దానము త్రిపదభూ తల మిత్తునంటివి
ధరణిఁజంద్రార్కులెం దాఁకనుండు
రంతభూమియు నొక్క యడుగయ్యె నాకును
స్వర్లోకమును నొక్క చరణమయ్యె
నీసొమ్ము సకలంబు నేడు రెండడుగులు
గడమపాదమునకుఁ గలదె భూమి
యిచ్చెద నన్నర్థ మీని దురాత్ముండు
నిరయంబు బొందుట నిజముగాదె.

ఆ॥ కానదుర్గతికినిఁగొంత కాలమునకు
గాకయిచ్చెదవేని వేగంబనాకు
నిప్పుడు మూఁడవపదమున కిమ్ము నాపు
బ్రాహ్మణాశీనములు దోవ బ్రహ్మవశము. 112

వ. అనియిట్లు వామనుండు పలుక సత్యభంగ సందేహ విషదిగ్ధ
శల్యనికృత్త హృదయుండయ్యును భీతుండు గాక వైరోచని
ప్రసన్న వదనంబు తోడఁజిన్ని ప్రోడ వడుగున కిట్లనియె. 113

ఆ॥ సూనృతంబుగాని నుడియదు నాజిహ్వ
బొంకఁజాల నాకు బొంకు లేదు
నీతృతీయపదము నిజము నాశిరమున
నెలవుసేసి పెట్టు నిర్మలాత్మ. 114

ఆ॥ నిరయమునకుఁ బ్రాప్తనిగ్రహంబునకును
బదవిహీనతకు నిబంధమునకు
నర్థభంగమునకు నఖిలదుఃఖమునకు
వెఱవ దేవ బొంక వెఱచినట్లు. 115

వ॥ అదియునుంగాక. 116

సీ॥ తల్లిదండ్రులు నన్నదమ్ములు చెలికాండ్రు
గురువులు శిక్షింపఁ గొఱఁతవడును
పిదప మేలగుఁగాక పృథుమదాంధులకును
దానవులకు మాకుఁ దరి యెఱింగి
విభ్రంశచతురు ల్వేలయ నిచ్చుటఁజేసి
గురువులలో నాది గురువ నీవ
నీవు బాధించిన నిగ్రహమో లజ్జ
యో నష్టియో బాధయో తలంప.

తే॥ నిన్ను నెదిరించి పోరాడి నిర్జరారు
లాదియోగీంద్రు లందెడు నట్టిచోట
నందరే తొల్లి పెక్కండ్రు హర్షమూర్తి
వైరభక్తులు గట్టిగా వలయుఁగాక
యీశ నీయెడ దుర్లభ మేమికలదు. 117

మ॥ చెలియే మృత్యువు చుట్టమే యముఁడు నా సేవారులే కింకరుల్
శిలలంజేసెన బ్రహ్మ దన్ను దృఢమే జీవంబు నోచెల్లరే
చలితంబౌట నెఱుంగరీ కపట సంసారంబు నిక్కంబుగాఁ
దలఁచున్ మూఢుఁడు సత్యదాన కరుణా ధర్మాది నిర్ముక్తుఁడై. 118

సీ॥ చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు
గాంతలు సంసార కారణములు
ధనము లస్థిరములు దనువతి చలనంబు
గార్యార్థులన్యులు గడచుఁగాల
మాయువ్వ నైశ్వర్య మతి శీఘ్రమనిగాదె
యనఘుండు దమతండ్రి నతకరించి
మాతాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు
నీపాదకమలంబు నియతిఁ జేరె

తే॥ భద్రుఁడతనికి మృతిలేని బ్రతుకుగలిగె
వైరులైకాని తొల్లిమా వారుగాన
రక్షివై వచ్చి నీవు న న్నడుగుటెల్లఁ
బద్మలోచన నాపుణ్యఫలము గాదె 119

వ. అని యిట్లు పలుకుచున్న యవసరంబున. 120

వ. అని పలికి జగదీశ్వరుండును నిఖిలలోకసాక్షియు నగు నారా
యణ దేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్న సమ
యంబున. 124

మ॥ తతవక్త్రద్విపయానయై కుచనిరుంధచ్చేల సావ్యానయై
ధృతబాష్పాంబు వితానయై కరయుగా ధీనాతికస్థానయై
పతిభిక్షాం మమ దేహి కోమలమతే నమస్తే యంచు ద
త్పతివింధ్యావళి సేరవచ్చె ద్విజగద్ధామునున్ వామనున్.

వ. వచ్చి యచ్చేడియ తచ్చరణ సమీపంబునం బ్రణతయై నిలువం
బడి యిట్లనియె. 125

క॥ నీకుం గ్రీడార్థములగు
లోకంబులఁ జూచి పరులు లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు
లోకములకు రాజవీవ లోకస్తుత్యా. 126

క॥ కాదనఁడు సొమ్ము లేదీ
రాదనఁడు జగత్త్రయైక రాజ్యము నిచ్చెన్
నా దయితుఁ గట్టనేటికి
శ్రీదయితా చిత్తచోర శ్రితమందారా. 137

వ. అని యిట్లు వింధ్యావళియును బ్రహ్లాదుండును విన్నవించు నవ
సరంబున హిరణ్యగర్భుండు సనుదెంచి యిట్లనియె. 128

సీ॥ భూతలోకేశ్వర భూతభావన దేవ
దేవజగన్నాథ దేవవంద్య
తనసొమ్ము సకలంబు దప్పకనీకిచ్చె
దండయోగ్యుఁడు గాఁడు దానపరుఁడు

గరుణింప నర్హుండు గమలలోచన నీకు
ఁ డిపింపు మాతని వెలుపు దీప్తి
తోయపూరము చల్లి దూర్వాంకురంబులఁ
జేరి నీపదము లర్చించునట్టి

తే॥ భక్తియుక్తుఁడు లోకేశ పదము నాఁడు
నీకు బ్రాపకుఁడుగ వచ్చి నేఁడు వేఁడ
నొసఁగి తన రాజ్యమంతయు నిచ్చెనట్టి
బలికిఁ దగునయ్య దృఢపాశ బంధనంబు. 129

వ॥ అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె. 130

సీ॥ ఎవ్వని గరుణింప నిచ్ఛయించితి నివాని
యఖిలవిత్తంబు నే నపహరింతు
సంసారగురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు
తెగడి లోకము నన్ను ధిక్కరించు
నతఁడెల్లకాలంబు నఖిలయోనులయందుఁ
బుట్టుచు దుర్గతిఁ బొందఁబడయ
విత్తవయోరూప విద్యాబలైశ్వర్య
కర్మజన్మంబుల గర్వ ముడిగి.

తే॥ యేక విధమున విమలుఁడై యెవ్వఁడుండు
వాఁడు నాకృప రక్షింప వలయువాఁడు
స్తంభలోభాభిమాన సంసారవిభవ
మత్తుఁడై చెడనొల్లఁడు మత్పరుండు. 131

శా॥ బద్ధుండై గురుశప్తుఁడై చలితుఁడై బాంధవ్యత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండునై పేదయై

శుద్ధసత్వంబును సత్యముం గరుణయుఁ జాంపేమియుందప్పఁడు
ద్బుద్ధుం డై యదయాఖ్యమాయ గెలిచెం బుణ్యాదితం డల్పుఁడే. 132

ఆ॥ అసురనాథుఁడనుచు ననఘుఁడిమర్యాద
యేను జాతునఁ బచు నింతిపలుక
నిజము పలికె నితఁడు నిర్మల చారుతా
మేలు మేలు నాకు మెచ్చువచ్చు. 133

క॥ సావర్ణి మనువు వేళను
దేవేంద్రుఁడగు నితండు దేవతలకు సం
భావితమగు నాచోటికి
రావించెద నంతమీఁద రక్షింతు దయన్. 134

క॥ వ్యాధులు దప్పులు నాధులు
బాధలు చెడి విశ్వకర్మ భావిత దనుజా
రాధిత సుతలాలయమున
నేధిత విభవముననుండు నితఁడం దాఁకన్. 135

వ॥ అని పలికి బలింజూచి భగవంతుండిట్లని యె. 136

సీ॥ సేమంబు నీకింద్రసేన మహారాజ
వెలవకు మేలు నీ వితరణంబు
వేలుపులందుండ వేడుక పడుఁసురు
దుఃఖంబు లిడుములు దుర్మరణము
లాతురతలు నొప్పులందుండు వారికి
[illegible] నొందవు సుతలమందుండు నీవు
నీవంపు సేయని నిర్జరారాతుల
నాచక్రమే తెంచి వఱకుచుండు

ఆ॥ లోకపాలకులకు లోను గావక్కడ
నన్యులెంతవిన్న నచటివారి
నెల్లఁబ్రిద్దువచ్చి యేను రక్షించెదఁ
గరుణతోడ నీకుఁ గావపత్తు. 137

క॥ జానవ దైత్యుల సంగతిఁ
బూనిన నీ యసుర భావమును దోడ్తో మ
ద్ధ్యానమునఁ దలగిపోవును
మానుగ సుతలమున నుండు మా మాయాజ్ఞన్. 138

వ. అని యిట్లు పలుకుచున్న మునుమ్మారుల ముదుక వేల్పు తియ్యని నెయ్యంపుఁ బలుకుం జెఱకురసంబు సోనలు వీనుల తెరువు లంజొచ్చి లోబయలు నుండి జెప్పలకప్పు తప్పంద్రోచికొని కనుఁగవ కొలంకుల నలుఁగులు వెడలిన చందంబున సంతసంబున గన్నీరు మున్నీరై పఱవ నురః ఫలకంబునం బులకంబులు కుల కంబులై తిలకంబులొత్తఁ గేలు మొగిడ్చి నెక్కొన్న వేడుకం బ్రొక్కుడుచుఁ జిక్కని చిత్తంబునఁ జక్కని మాటల రక్క సులఱేఁడిట్లనియె. 139

ఉ॥ ఎన్నఁడు లోకపాలకుల నేఁగృప సూడని నీవు నేడువ న్నున్నతిచేసి నాబ్రతుకు నోజయు నావతియిచ్చి కాచితి వున్ననలి దయారసము మాటల పెద్దతికంబు చాలదే పన్నగతల్ప నిన్నుఁజేఁగి పట్టిన నాకద గల్గ నేర్చునే. 140

—. బలి చక్రవర్తి సుతలలోకమునకుఁ బోవుట :—

వ. అని బలిక బంధవిముక్తుండై హరికి నమస్కరించి బ్రహ్మకుం బ్రణామంబు సేసి యింద్రుధరునకు వందనం బాచరించి తన

వారునుం దానును సుతలంబునకుం జనియె అంత హరి కృపా
వశంబునం గృతార్థుండై కులోద్ధారకుండైన మనుమనింగని
సంతోషించి ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె. 141

సీ॥ చతురాననుండును శ్రీపాదంబుగానండు
శర్వుండు లక్ష్ముల జాడఁబొందఁ
డన్యులకెక్కడి దసురులకునుమాకు
బ్రహ్మాది పూజిత పదుండవైన
దుర్లభుండవు నీవు దుర్గపాలుండవైతి
పద్మజాదులు భవత్పాదపద్మ
మకరంద సేవన మహిమ నైశ్వర్యంబు
లందిరి కానమే మల్పమతుల

తే॥ మధిక దుర్యోధులము కుత్సితాత్మకులము
నీకృపాదృష్టి మార్గంబు నెలవు సేర
నేమి తపమాచరించితి మెన్నఁగలమె
మమ్ముఁ గాచుట చిత్రంబు మంగళాత్మ. 142

ఆ॥ సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు
నొకట విషమవృత్తి నుండు దరయ
విచ్చలేనివారి కీవు భక్తులుగోరు
తలఁపులిత్తు కల్పతరువుమాడ్కి. 143

వ॥ అని విన్నవించుచున్న ప్రహ్లాదుంజూచి పరమపురుషుం డిట్లనియె. 144

తే॥ వత్స ప్రహ్లాద మేలు నీ వారునీవు
పోరిది మనుమనిఁ దోడ్కొని సుతలమునకు
బైనమై పొమ్ము నే గదాపాణినగుచుఁ
జేరి రక్షింప దురితంబు చెంద దచట. 145

వ. అని యిట్లు నియమించినం బరమేశ్వరునకు నమస్కరించి
కొని కరకమలపుట ఘటిత నిటల తటుండై వీడ్కొని బలిం
దోడ్కొని సకలాసురయూథంబునుం దాను నొక్క మహాబిల
ద్వారంబు సొచ్చి బ్రహ్మాదుండు సుతల లోకమునకు జనియె
నంత బ్రహ్మవాదులయిన యాజకుల సభామధ్యంబునం గూ
ర్చున్న శుక్రునింజూచి నారాయణుం డిట్లనియె. 146

ఆ॥ ఏమి కొఱఁత వడియె నీతని యాగంబు
విస్తరింపు మీవు విప్రవర్య
విషమమయిన కర్మ విసరంబు బ్రాహ్మణ
జనులు సూచి నంత సమతఁ బొందు. 147

వ. అనిన శుక్రుం డిట్లనియె.

సీ॥ అఖిల కర్మంబుల కధినాథుఁడవు నీవు
యజ్ఞేశుఁడవు నీవు యజ్ఞపురుష
ప్రీత్యర్థమున నీవు పరితుష్టిఁ బొందినఁ
గడమ మేల గల్గునే కర్మములకు
ధనదేశ కాలార్హ తంత్రమంత్రంబులఁ
గొఱఁతలు నిన్నుఁ జేర్కొనినమాను
నైనఁ గావింతు నీ యానతి భవదాజ్ఞ
మెలఁగుట జనులకు మేలు గాదె

తే॥ యింతకంటెను శుభమునా కెచట గలుగు
ననుచు హరి పంపు శిరమున నావహించి
కావ్యుఁడసురేంద్రు జన్నంబు కడమ దీర్చె
మునులు విప్రులు సాహాయ్యమునఁ జరింప. 148

వ. ఇవ్విధంబున వామనుండై హరి బలి నడిగి మహిం బరిగ్రహించి
తనకు నన్నయగు నమరేంద్రునకుం ద్రివిష్టపంబును సదయుండై

నిళవంబు మూడడుగుల నంగీకరించిన నప్పుడు బ్రహ్మయు శర్వుండును సనకాదులును భృగుప్రముఖులయిన మునులును, పితృదేవతలును, దక్షాది ప్రజాపతులును, సిద్ధులును, వైమానికులును, మఱియుం దక్కినవారలు నద్భుతకరాక్రమం బైన విష్ణుప్రభావంబునకు నాశ్చర్యము నొందుచుఁ బ్రశంసించుచు నాడుచుం బాడుచుం దమతమ నివాసంబులకుం జనిరని చెప్పి శుకుం డిట్లనియె. 154

తే॥ మనుజనాథ త్రివిక్రము మహిమ కొలఁది
యెఱిఁగి తర్కింప లెక్కింప నెవ్వఁ డోపు
భూమిఁ గల రేణుకణములు గుణుతు వెట్టు
వాఁడు నేరఁడు తక్కిన వాని వశమె. 155

క॥ అద్భుత వర్తనుఁ డగు హరి
సద్భావిత మైన విమల చరితము వినుచో
నుద్భట విక్రముఁ డై తుది
సద్భావితలీలఁ బొందు నుత్తమగతులన్. 156

తే॥ తగిలి మానుష పైతృక దైవకర్మ
వేళలందు త్రివిక్రము విక్రమంబు
లెక్కడెక్కడఁ గీర్తింతు రెవ్వ రేని
పొందుదురు నిత్యసౌఖ్యంబు భూవరేంద్ర. 157



సమాప్తము.

శ్రీ రామభద్ర పరబ్రహ్మార్పణమస్తు.

శ్రీరామ ప్రెస్ బరంపురం, గంజాం (జిల్లా.)

యిచ్చె. అప్పుడు దక్ష భృగు ప్రజాపతులును భవుండును గుమారుండును, దేవర్షి పితృగణంబులును, రాజులును దానును గూడికొని చతురాననుండు గశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు లోకపాలురకును వామనుండు వల్లభుండని నియమించి ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవతలకు వేదంబులకు స్వర్గాపవర్గంబులకు నుపేంద్రుండు ప్రధానుండని సంకల్పించె నా సమయంబున. 149

క॥ కమలజుఁడు లోకపాలురు
నమరేంద్రునిఁ గూడి దేవయానంబున న
య్యమరావతికిని వామను
నమరం గొనిపోయి రంత నటమీఁద నృపా! 150

ఆ॥ బల్లిదంపుఁదోడు ప్రాపున నింద్రుని
కింద్రపదము చేరు టెల్ల గలిగెఁ
దనకు నాథుఁడయిన తమ్ముఁడు గలిగిన
గోర్కు లన్ని కేలఁ గొలుఁ దనొందు. 151

క॥ పాలడుగఁడు మేలడుగం
డేలఁడు భిక్షించియన్న కిచ్చెఁ ద్రిదివమున్
వేలుపులతల్లి కడుపటి
చూలుం బోలంగఁ గలరె సాలయని తమ్ముల్. 152

ఆ॥ కడుపు బరువుగాఁగఁ గొడుకులఁ గనుకంటెఁ
దల్లికొకఁడె చాలు బల్లిదుండు
త్రిదశగణముఁ గన్న యదితి కానుపుదీర్చె
చిన్ని మేటివడుగుఁ గన్నయట్లు. 153

వ. ఇట్లు దేవేంద్రుండు వామన భుజపాలితంబగు త్రిభువన సామ్రాజ్య

# Annotations On Vamana Charitram.



వ్యాసమహర్షి:—

మహాభారతము విరచించి ప్రఖ్యాతిఁగాంచిన వ్యాసమహర్షికి నాత్మసంతుష్టిఁగలిగించిన మహాపురాణము భాగవతము — భాగవత రచనాంతరమున వ్యాసమహర్షి పొందిన యాత్మ సంతుష్టి వర్ణనాతీతమని చెప్పవచ్చును. భగవంతునిఁగూర్చి వ్రాయఁబడిన గ్రంథము భాగవతము. భక్తి రసపూరితము. శరీరమునకు భుక్తి యెందుకో, ఆత్మకు భక్తి యందుకే యని మహాత్ములందురు.

బమ్మెరపోతరాజు:—

వ్యాసప్రోక్త మహాభారతము నాంధ్రీకరింపఁబడిన తరువాత బమ్మెర పోతరాజు వఱకుఁగల కవుల దృష్టి సంస్కృత భాగవతముపైఁ బడకుండుటకు హేతువూహింపఁదగినదే—భగవద్భక్త శిఖామణియగు బమ్మెర పోతరాజు దృష్టి సంస్కృత మహాభాగవతము నాకర్షించినది.

"పలికించెడివాఁడు రామభద్రుండ"ని ధైర్యము వహించి భగవత్కవి పోతరాజు పండిత పామర సమ్మతముగా సరస సాహిత్య సుధాలహరిఁ బ్రవహింపఁజేసి సంస్కృత భాగవతము నాంధ్రీకరించి యాంధ్రుల మన్ననలకుఁ బాత్రుఁడయ్యెను.

ఉత్తరహిందూస్థానమున శ్రీతులసీ దాస మహాకవి వలెనే యాంధ్రదేశమున బమ్మెరపోతరాజు భగవత్కవి శిఖామణిగా ప్రఖ్యాతిఁగాంచెను.

కడపమండలమునఁ గల "ఒంటిమిట్ట"—ఏకశిలానగరమని భాగవతమున జెప్పఁబడినట్టిది—శ్రీపోతరాజు నివాసస్థలమని నిర్ణయింపఁబడినది. ఇమ్మహాకవి తండ్రి కేతన. తల్లి లక్కమ్మ కొడుకు మల్లన్న. నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీనాథమహాకవి యితని భార్యకుఁ దోబుట్టువనియందురు. బమ్మెర పోతరాజు హయాణశకము 1435 వ సంవత్సరము వఱకు జీవించియున్నవాఁడని చెప్పవచ్చును.

ఈ వామన చరిత్రము శ్రీమదాంధ్రి భాగవతము లోని యష్టమస్కంధమునందలిది. శ్రీ బమ్మెర పోతరాజు మహాకవిచే నాంధ్రీకరింపఁబడిన భాగవత గ్రంథమే కారణముననో కొన్నికొన్ని భాగములు నశింపఁగా, హరిభట్టారకుఁడు, ఏర్చూరి సింగయ్య, గంగయ్య, వెలిగందల నారయ్యాయను కవులాయా భాగములఁ బూరించిరి.

శ్రీరామ మంత్రి ప్రభావముననో, సహజ ప్రతిభా విశేషముననో సహజ పాండిత్య బిరుదాంకితుఁడగు బమ్మెర పోతరాజు కవితా చాతుర్యము వామనచరిత్రమున నీక్రింది సంఖ్యగల పద్యములవలన నెఱుఁగ వచ్చును.

1, 18, 19, 20, 32, 34, 39, 41, 49, 51, 53, 59, 62, 64, 65, 76, 77, 79, 82, 93, 94, 96, 118, 121, 125, 132,

ఈ పై పద్యములు వ్యాఖ్యాన పద్యములు — పండిత జనైక వేద్యములు విద్యార్థులకతి ముఖ్యములు... ... ...

# పూర్వ కథా భాగము.

సకలవిధమ ప్రయత్నమున బలి దేవేంద్రునితోఁ బోరాడి విఫలమనోరథముతో నడవులఁబట్టి చనియెను. భార్గవులచేఁ గొంతకాలము వరకు బలి పోషింపబడెను. భార్గవుల కరుణాకటాక్షమున శిష్యుఁడై వర్తించిన బలి కొంతకాలమునకు నభివృద్ధి పొంద గలిగెను. భార్గవులు బలి భక్తి శ్రద్ధలకు మెచ్చి వానిచే విశ్వజిద్యాగంబు విధ్యుక్తముగాఁ జేయించిరి. వాని యాగంబునకు మెచ్చి హోమాగ్నిహోత్రుండు దివ్యమైన రథమును, సింహ పతాకము, అమోఘ ధనువు, పూర్ణ తూణయుగళమును, గవచము నొసంగెను. అనంతరము యతని తాత ప్రహ్లాదుఁడు దివ్య పద్మమాల నొసంగెను. శుక్రుఁడు శంఖము నొసంగెను. ఇవ్విధంబున రణోపయోగమహోపకరణముల సంపాదించి బలి చెదరిన తన సేనాసమూహమును దిన దినము వృద్ధి పొందించి, ఒకనాఁడు శుక్రచార్యుల వారియనుమతిఁబొంది విశిష్టదేవతలను బూజించి, ప్రహ్లాదునకు నమస్కరించి రథారూఢుఁడై దండాధీశ్వరులు తన యానతి నవధరింప దేవేంద్రలోకము నాక్రమించెను. ఎల్లమార్గంబుల నరికట్టి రాక్షసులు శంఖా విర్భూత ధ్వనులతో నాకలోకమును గడగడ లాడించిరి.

అంత చేయునది లేక దేవేంద్రుఁడు సమాన బలముతో బలి నెదిరించిన ప్రయోజనముండదని యెంచి తమ కుల గురువగు బృహస్పతిని రప్పించి బలిని జయింప నపాయము లేని యుపాయమెఱుంగ గోరెను — "ఓ మహాత్మా రాజ్యము శత్రువునకు సమర్పింప జాలను—అట్లని యుద్ధమునకుఁ బోఁజాలను. రాక్షసులకుఁ జిక్కి చావరాదు గదా". అని పలికిన దేవేంద్రునిజూచి ఆచార్యుఁడిట్లనియె:"ఓయీ దేవేంద్రా! నీవనినది బాగుగ నున్నది కాని యిప్పటికి రాక్షసులకు రాజ్యమర్పించి తొలంగి చనుటయ మేలు. బ్రహ్మ వాదులయిన భృగువుల కరుణాకటాక్షమున బలి కిట్టి యమోఘమైన బలము చేకూరినది. ఇప్పుడు బలి నెదిరించి పోరాడుటకు హరి హరులు దక్క తదన్యులసమర్థులు. నీవు గాని నీ సమానులు గాని నిన్ను మించిన వారు గాని జయింపఁ జాలరు. మనకుఁ దగిన కాలము మును ముందు రానున్నది. అంత వఱకు మనము స్వర్గము విడిచి వెడలుటయ మంచిది— సమయము నిరీక్షించి వీని వినాశకాలమెఱుంగింతును. నడువుము" అనవిని దేవేంద్రుఁడు దిక్పాలురతో దేవతలతో దేవలోకము విడిచి పెట్టి యెచటికో వెడలిపోయెను. అనంతరము దానవ చక్రవర్తి దేవలోకమధిష్ఠించి క్రమ క్రమముగా జగత్త్రయు మాక్రమించి విశ్వ విజయుఁడను ప్రఖ్యాతితోఁ బెద్దకాలంబు రాజ్యమేలు చుండెను. శుక్రాచార్యుఁడు వానిచే శతాశ్వమేధంబులు జేయించెను.

బలిచక్రవర్తి పరిపాలనంబున దరిద్రులు లేరు. ఎవరే ప్రయత్నముల ఁజేసిన ఫలించు చుండెను. శత్రువులెచటను గానరారు. దేవాగారాములందు మహోత్సవంబులు జరుగు చుండెను. బ్రాహ్మణులు సంపూర్ణ కాములై యుండిరి. కాలానుకూలంబుగా వర్షంబులు గురియు చుండెను. భూదేవి "వసుంధర" అను నామము సార్థకము జేసుకొనెను. ఇంత యేల వాని రాజ్యము నిత్య కల్యాణమై పచ్చతోరణము నై యుండెను.

దేవతల తల్లి అదితి గనుక దేవతలాదిత్యులనఁబడిరి. దితి సంతానము దైత్యులు. వీరే రాక్షసులనఁబడిరి కశ్యప బ్రహ్మకు దితి, అదితి యిరువురు భార్యలు. అదితి తన కుమారులు దేవతలు రాక్షసులకు యోడి పారిపోవుట విని యెంతయు దుఃఖించు చుండెను..

ఇట్లుండ నొకనాఁడు కశ్యపబ్రహ్మ యదితిగృహంబునకేతెంచి కష్టసుఖముల నరయఁ జొచ్చెను. అదితి మిక్కిలి దుఃఖించి దేవతలకు సంభవించిన దురవస్థ తన పతికెఱింగించెను. అనంతరమా కశ్యప బ్రహ్మ భార్యకు గల దుఃఖము నివారించి మహాత్మ మాత్రంబు చింతించి భావికాల కార్యంబు విచారించి యిట్లనియె. "నీకొక్క యుపాయము చెప్పెద నాకర్ణింపుము. భగవంతుండగు హరి కృపాపారీణుఁడు. అతనిని సేవించి నీవిష్టార్థముఁ బొందవచ్చును."అని పలికి కశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణమను వ్రతము నుపదేశించి తద్విధాన మెఱింగించి చనియెను. అనంతరమా సతీమణి భర్త చెప్పిన చొప్పున పండ్రెండు దినములు వ్రతము నిర్వర్తించి నియతయై యుండగా నారాయణదేవుండు ప్రత్యక్ష మయ్యెను.

అట్లు ప్రత్యక్షమైన హరిం గనుఁగొని యదితి యానంద బాష్పముల విడిచి మాటిమాటికి నమస్కారములు జేయుచు ననేక విధంబుల సన్నుతించెను. అంత శ్రీహరి యెంతయు సంతోషించి యదితిభావము నెఱింగిన వాఁడగుట నిట్లనియె "అమ్మా! దుఃఖింపకుము. నీ కోడండ్రు, నీ కుమారుఁడు, నీ నాథుఁడు, నీవు నన్ను కీర్తింప సతులుఁబతులు మిక్కిలి సమ్మోదింప రాక్షసులు శోకింపగా నీ గర్భమున నేను తేజోమూర్తి నై జన్మించెదను. నేను సుతుఁడ నై జన్మించుటకు వేడుక పుట్టుచున్నది. అన్ని విధముల బల ప్రపూర్ణుఁడై యున్న బలిని, రాక్షసులను వినయో పాయము చేతనే జయింప వలెఁగాని కేవలము బలము వలన ప్రయోజనము లేదు. నీవు సంచలింపకుము. నీ నియతికి భక్తికి మెచ్చితిని దేవేంద్రుఁడు, దేవతలు, శచీ దేవియు, మెచ్చ దైత్యుల సామ్రాజ్యము హరించి యింద్రునకిచ్చెదను." అని యిట్లు నారాయణుండు వచించి తిరోహితుండయ్యెను. అయ్యదితియు కృతకృత్య యై శ్రీహరిని స్మరించుచు దన భర్తయైన కశ్యపుని సేవించు చుండెను. ఇట్లు కొంత కాలమునకు క్రమ క్రమముగా భగవత్కరుణా కటాక్షమున నిండు చూలాలై నవమాసముల భరించి యొకా నొక శుభ దినంబున వామనుం గనియెను. ఇది పూర్వ భాగము.

వామనుఁడు జన్మించినది మొదలు బలిచక్రవర్తిని సుతల లోకంబునకుఁ బంపు వరకుఁగల కథ యుత్తర భాగము, ఈ భాగమే పఠనీయ గ్రంథము.

# పద్యములకు-అర్థ తాత్పర్యములు.

1 రవి= సూర్యుఁడు. మధ్యాహ్నమునన్=పట్టపగటియందు. చరింపన్=తిరుఁగగా, గ్రహా....స్థితిన్ — గ్రహ = శుక్రుఁడు బృహస్పతి మొదలగు గ్రహములయొక్కయు. తారా=అశ్విన్యాది నక్షత్రములయొక్కయు. చంద్ర=చంద్రునియొక్కయు. భద్రస్థితిన్=శుభస్థానములందుండగా. శ్రవణద్వాదశినాఁడు. శ్రోణన్=చంద్ర గతమయిన శ్రవణ నక్షత్రమునందు. అభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్=అభిజిత్తనెడి పేరుగల లగ్నమునందు. పుణ్య...కున్-మంచి నియమములతోఁగూడినదానికి. దివజాధీశ్వరుమాతకున్=దేవేంద్రుని తల్లికి పరమపాతివ్రతవిఖ్యాతకున్=మిక్కిలి మేలైన పతివ్రతాధర్మములచేత ప్రసిద్ధురాలికి భువనాధీశుఁడు=లోకములకు ప్రభువైన విష్ణుదేవుఁడు. వామనగతిన్=పొట్టివానివిధమున ( పుట్టెను. )

తా. సూర్యుఁడు మధ్యాహ్నమునందు చరించుచుండఁగా శుక్రుఁడు మొదలు గాఁగల గ్రహములును అశ్విని మొదలగు నక్షత్రములును, చంద్రుడును శుభస్థానములందుండఁగా భాద్రపద శుద్ధ ద్వాదశినాఁడు చంద్రునితోఁ గూడిన శ్రవణనక్షత్రమునందు అభిజిన్ముహూర్తమునందు మంచినియమములు గలదియు ఎచ్చైన పతివ్రతాత్వము చేత ప్రసిద్ధురాలునైన అదితిదేవికి శ్రీవిష్ణుదేవుఁడు వామనుఁడై పుట్టెను.

2 మఱియును=ఇదిగాక. అద్దేవుండు=ఆదేవుఁడు. శంఖ....చతుర్భుజుండును శంఖ=శంఖముతోడను, చక్రముతోడను. గదతోడను, పద్మము తోడను కలిత=కూడుకొన్న. నాలుగు భుజములు గలవాఁడును, పిశంగవర్ణవస్త్రుండును గోరోజనపువన్నెవస్త్రముగలవాఁడును. మకర=మొసలియాకృతిగల. కుండల చెవి పోఁగులచేత. మండిత-అలంకరింపఁబడిన, గండభాగుండును=చెక్కిటితావులుగలవాఁడును. శ్రీవత్సవక్షుండును=శ్రీవత్సమనెడి మచ్చతోడి ఱొమ్ము గలవాఁడును. నళినచక్షుండును=తామరల వంటి కన్నులు గలవాఁడును. నిరంతర....పరిష్కృతుండును—నిరంతర—యెడము లేని—దట్టమైన, శ్రీవిరాజిత—కాంతివిశేషముచేత ప్రకాశింపఁజేయఁబడిన. రోలంబ—తుమ్మెదలయొక్క— కదంబ సమూహముచేత. ఛుంబిత—సీడలు జేయుచున్న. వనమాలికా—తోమాలచేత. పరిష్కృతుండును-అలంకరింపఁబడినవాఁడును, కనక—తుండును—బంగారు

హా యమ యిన. కింకణ—మువంజేతికడియములు. కాంచివలయ—మొలనూలు అంగద— బాహుపురులు. నూపుర—అందెలు. అలంకృతుండును — వీనిచేత అలంకరింపఁబడినవాఁడును. కమనీయ ... ణుఁడును — కమనీయ—మనోహరమ యిన. కౌస్తుభ-కౌస్తుభములను మణితోఁగూడిన. కంఠాభరణుండును—మెడసా ... గలవాఁడును. నిఖిలజనమనోహరుండును—ఎల్లజనుల మనస్సునకుఁబ్రియ ... వాఁడును. ( అయి ) అవతరించిన. సమయంబునన్—పుట్టినకాలమునందు.

3 యక్ష ... ధీశ్వరుల్—యక్ష—యక్షులు. తార్క్ష్య—గరుడులు. సుమనః—దేవతలు సిద్ధ—సిద్ధులు. ఉరగ—నాగులు. అధీశ్వరులు—వీరికి అధిపతులయిన కుబేరుఁడు, గరుత్మంతుఁడు, దేవేంద్రుఁడు వాసుకి అనువారు. సాధ్య ... విద్యాధరుల్—సాధ్య—సాధ్యులు. చారణ — చారణులు, మునీశ — ముని శ్రేష్ఠులు ( బ్రహ్మవిద్యాధరులును సంతోషించిరి. )

4 ( సుగమము )

5 కుమార సముచితాలాపంబులాడుచు—కొడుకైన వాఁడు ఆడదగిన మాటలును. ( ఆడుచు ) తనయ—కొడుకును. విలోకన—చూచుటవలన పరిణామ—సంతోషముచేతనైన. పారవశ్యంబున—పరవశత్వముచేత—చొక్కుచేత.

6 ( సుగమము. ) 7 ( సుగమము ) 8 పుణ్యపురంధ్రులు — మంచివారైన యుత్తమ స్త్రీలు. ఈ బోటికిన్—ఈ స్త్రీకి. ఇందిర—లక్ష్మీదేవి. పురుడు—సమానము. అంబిక—పార్వతి. కాక—అగుదురుగాని ఒరులు—ఇతరులు. పురుడే—సమానులా. అనుచున్-అని. పురుటాలికిన్ బాలింతరాలికి పది దినములపురుడున్ — కన్నదినము మొదలు పది దినములు కాఁగానే పుచ్చవలసిన పురుడును. ప్రవర్తించి- క్రమముగాఁబుచ్చిరి.

తా. యోగ్యురాండ్రయిన యుత్తమస్త్రీలు, ఈ యదితి దేవికి సమానులు లక్ష్మీదేవి పార్వతీదేవి తప్ప నితరులుకారు అని పొగడుచు కన్నపది దినములకు పుచ్చవలసిన పురుడును పుచ్చి స్నానము చేయించిరి.

9 అంతన్—అటుపిమ్మట. ఆబ్బాలుకున్—ఆబాలునకు సంతసంబునన్-సంతోషముతో మహర్షులు గొప్పవారైన మునులు. కశ్యపుంబురస్కరించుకొని—కశ్యపమునిని ముందట పెట్టుకొని సముచితో ... బులు. సముచిత—తగిన.

ఉపనయనకర్మ - వడుగుయొక్క కలాపంబులు - పనుల సమూహములను. సవిత–సూర్యుఁడు, సావిత్రిన్ - గాయత్రీమంత్రమును. యజ్ఞోపవీతంబును–జందెమును. ( కశ్యపుఁడు ) ముంజియున్ - దర్భమొలత్రాడును. ( అదితి ) కౌపీనంబున్–గోఁచియు. ధరణి-భూదేవి. కృష్ణాజినంబును–జింకతోలును. సోముండు–చంద్రుఁడు. దండంబున్–మోదుగు కఱ్ఱను. గగనంబు–ఆకాశము. ఛత్త్రంబున్–గొడుగును, ( బ్రహ్మ ) కమండలువును–బ్రహ్మచారికిఁదగిన జల పాత్రమును. ( సరస్వతి ) అక్షమాలికయున్ - స్ఫటికపుజపమాలికయు. సప్తర్షులు-సప్తమహామునులు. కుశపవిత్రంబులును-దర్భముళ్ళను. ( ఇచ్చిరి ).

10 నరేంద్రా-రాజా ! మాణవునకు–ఆబ్రహ్మచారికి. యక్షేశుఁడు-కుబేరుఁడు భిక్షాపాత్త్రంబు-భిక్షమెత్తుకొనునట్టి పాత్రమును ( ఇచ్చెను. ) భవాని–పార్వతి సాక్షాత్కరించి-ప్రత్యక్షమయ్యెను. (అక్షయము) అనుచున్-అనిచెప్పుచు. భిక్షువకున్-బ్రహ్మచారికి పూర్ణభిక్ష-నిండుభిక్షము. ( పెట్టెను )

తా. ఓరాజా ! ఇది గాక ఆ బ్రహ్మచారికి కుబేరుఁడుభిక్షాపాత్రమునిచ్చెను అంతట పార్వతి వచ్చి అక్షయము అని చెప్పుచు కొఱఁత లేని భిక్షను పెట్టెను

11 వటుఁడు-బ్రహ్మచారి. శుద్ధబ్రహ్మర్షిసమారాధ్యుండై నిర్మలు లయిన బ్రహ్మర్షులచేత ఆరాధింపఁదగినవాఁడై. విహితమంత్రరాజిన్ - చదువ దఁగిన మంత్రముల సమూహమును. [చదువుచును] ఇద్ధంబు–వెలుఁగునది. అగునవలంబునన్-అగునట్టియగ్నియందు. వృద్ధాచారమునన్-పెద్దలవాడుక చొప్పున.

తా. అప్పుడా బ్రహ్మచారి పరిశుద్ధులయిన బ్రహ్మర్షులకు ఆరాధింపఁదగిన వాఁడు అయి వేదమంత్రములను చదువుచు తమ పెద్దల వాడుక చొప్పున చక్కగా వెలుఁగుచున్న అగ్నియందు హోమమును చేసెను.

12 మాయామాణవకుఁడు–కపట బ్రహ్మచారి.

13 సుగమము. 14 సుగమము. 15 కామ్యార్థములన్-కోరిన ధనములను. బహుసంపల్లాభములన్-పెక్కులయిన కలుములయొక్క వచ్చు బళ్ళను

16 సుగమము. 17 రాజీవాక్షుఁడు–విష్ణుదేవుడు. ప్రక్షీణ–మిక్కిలి క్షీణించిన. దివిజ వల్లభ-దేవేంద్రుని యొక్క, రక్షా కాపాడుటయందు. పరతంత్రుడు పరాధీనుఁడు-ఆసక్తుఁడు–అగుచున్-అవుచును. పేదతికమునన్ –దరిద్రత్వముతో భిక్షాగమనంబుసేసెన్–భిక్షకై పోయెను.

తా॥ వామనుఁడు అట్లు బయలుదేఱి తన సంపదయెల్ల నశింపగా అల్లాడు చున్న దేవేంద్రుని సంపన్నునిఁగా జేసి కాపాడుట యందలి యక్కఱచేత బలిని యాచింపఁగోరి అతని యింటికి బోయెను.

18 హరిహరి—ఔరా సిరియు రమునఁగలహరి—లక్ష్మిఃబొమ్మునందుఁగలవిష్ణుదేవుఁడు. హరిహయుకొఱకున్—ఇందునిని కొఱకు. దనుజున్—రాక్షసుఁడయిన బలిని. అడుగంజనియెన్—యాచింపఁబోయెను. పుడమిన్—భూమియందు. పరహితరతిమనియుతులు—ఇతరులయొక్క మేలుగోరెడి బుద్ధితోఁగూడినవారు. అగుదొరలకున్—అగునట్టిప్రభువులకు అడుగుటలున్ — ఒకరిని యాచించుటలుగూడ. ఒడలితొడవులు—దేహమునందు దరించెడిసొమ్ములు. తా॥ లోకులపేదఱికమును పోగొట్టునట్టి లక్ష్మిదేవిని బొమ్మునందుంచుకొనియుండెడి విష్ణుదేవుఁడుగూడ ఇందునినికొఱకు పేదఱికముతో బలిని యాచింపఁబోయెను. ఔరా ఇదియెంతవింత? అయినను భూమియందు ఒకరిమేలుగోరెడి బుద్ధిగల రాజులకు పరులను యాచించుటకూడ ఒక అలంకారముగా నుండును గాన అట్లుచేసెను.

19 వటుఁడును—ఆ బ్రహ్మచారియు. శర్మదన్—సుఖమునిచ్చుదానిని. యమదండాహతవర్మదన్—యమునియొక్క దండాయుధము యొక్క దెబ్బతగులనియ్యనికవచము నిచ్చుదానిని. అతి...దన్—అతి—మిక్కిలి కఠిన—గట్టియైన. ముక్తివనితా—మోక్షస్త్రీయొక్క. చేత—మనసునందలి మర్మదన్—గుట్టునిచ్చుదానిని. అంబు—నీళ్ళచేత. నివారిత—పోగొట్టబడిన. దుర్మదన్ — చెడ్డకొవ్వుగలదానిని. నర్మదన్—నర్మదానదిని. తరించెన్—దాఁటెను. తా॥ అట్లుపోయిన యావామనుఁడు మార్గమునందు సుఖము నిచ్చునదియు యమబాధలనుతొలగించునదియు మిక్కిలి తెలియరాని ముక్తియనెడి స్త్రీయొక్క మనసులోని రహస్యమును తెలియఁజేయునదియు అనఁగా మోక్షము నిచ్చునదియు తన జలముచేత చెడ్డకొవ్వును తొలగించు నదియు నైన నర్మదయను నదిని దాఁటెను.

20 వటుండు—బ్రహ్మచారి. బహుధా—నానావిధములుగా. జల్పత్—మాటలాడుచున్న. నిశాటంబున్—రాక్షసులు గలదానిని. ఉద్దండా—నిక్కు గల వారిచేత. ఆహూత—పిలువబడిన. మునీభ్య—మునిశ్రేష్ఠులయొక్కయు బిభ్యత్—భయపడుచున్న. అమృతాంధః—దేవతలయొక్కయు, సిద్ధ—సిద్ధులయొక్కయు, కూటంబున్—సమూహములుగలదానిని. వేదండాశ్వధ్వజినీకవాటమును — ఏనుగులయు

గుఱ్ఱములయుదండేతలుపులుగాఁగల దానిని. ఘోటమున్-మహత్-అధికము యిన, ధూమ—పొగచేత. సంఛన్న—చక్కఁగాఁగప్పఁబడిన. మార్తాండ — సూర్యునియొక్క. స్యంధన-ఘోటమున్—రథపుగుఱ్ఱములదానిని. మఖా—యజ్ఞము యొక్క. అంతః—లోపలిదైన. వేదికా—వేదికయొక్క వాటమున్—జాడగలదానిని. చండస్ఫూర్తి—భయంకరమయినతోఁపిక గలదానిని. కాంచెన్—చూచెను.

తా॥ బహువిధముల మాటలాడుచున్న రాక్షసులు గలదియు గర్వించినవారిచేఁబిలువఁబడిన మునిశ్రేష్ఠులును భయపడిన దేవతల గుంపులును సిద్ధులగుంపులును గలదియు తలుపులవలె బారులు దీర్చి ద్వారములకడ్డముగా నిలుపఁబడిన యేనుగుల దండును, గుఱ్ఱముల దండును గలదియు మిక్కిలి మెగయుచున్న పొగచేత కప్పఁబడిన సూర్యమండలము గలదియునై భయంకరముగాఁగానవచ్చుచున్న బలిచక్రవర్తి యజ్ఞశాలను వామనుఁడు చూచెను.

21 సుగమము. 22 పయోజభవుఁడో—బ్రహ్మయో. చండాంశుఁడో—సూర్యుఁడో, వహ్నియో-అగ్నిదేవుఁడో, దంభాకారతన్—కపటరూపత్వముతో ధరణిన్—భూమియందు. ధాత్రీసురుండు—బ్రాహ్మణుఁడు. ఈశుంభద్యోతనుఁడు—ఈ మిక్కిలి ప్రకాశించువాఁడు. ఈ మనోజ్ఞతనుఁడు—ఈ మనోహర మయిన దేహము గల వాఁడు విస్మయభ్రాంతులై-ఆశ్చర్యము చేత భ్రమనొందిన.

తా॥ అప్పుడా బలిచక్రవర్తి యాగశాలయందున్న సభికులందఱును వామనిఁజూచి యితఁడొక కపట రూపముతో వచ్చిన శివుఁడో, విష్ణువో, బ్రహ్మయో, అగ్నియో, సూర్యుఁడోకాని యితరుఁడుకాఁడు. భూమియందు ఇంకొక బ్రాహ్మణమాత్రునికి ఇట్టి తేజస్సు ఇట్టి మనోహరమయినయాకృతి యుఁగలిగి యుండునా యని ఆశ్చర్యము చేత భ్రమనొందిన. వారై రహస్యముగా ఒకరితో నొకరు చెప్పుకొనిరి.

23 సుగమము. 24 సుగమము, 25 చవులుగాన్—ఇంపుగా సామగానంబులు-సామవేదము పాటలు. హోతల—సామవేద పఠనము చేయు ఋత్విక్కుల యొక్క. మంత్రతంత్రార్థ సంబంధ భావములు—మంత్రముల యొక్కయు తంత్రముల యొక్కయు సంబంధత్వమును. ఉన్న త్రేతాగ్నులన్—ఉన్నట్టి గార్హపత్య ఆహవనీయ దక్షిణాగ్నులను. బహువిధాధ్వర విధానంబులు—అనేక విధములైన.

యజ్ఞములుచేయు రీతులను. పొట్టివడుగు—పొట్టివాఁడైన బ్రహ్మచారి ( వామనుఁడు. ) తా॥ పొట్టి బ్రహ్మచారియైన యీ వామనుఁడు ఆ సభయందు చెవులకింపుగా సామవేదమును చగువుచున్న హోతల చదువును వినుచు, మంత్రతంత్రముల క్రమమును దెలుపుచున్న పెక్కు యజ్ఞములు చేసిన సోమయాజులతోఁగూడుకొనుచు హోమకుండములయందు గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నులనెడి మూడగ్నులను వెలిఁగించు చున్న యాజకుల సమూహమును చూచుచు, సమర్థులై యనేక విధములైన యజ్ఞములను జేయు రీతులను దెలియఁజేయునట్టి సభికుల దగ్గఱఁ జేరుచు దానమును గోరునట్టి క్రమమును వాడుక పఱచుకొనుచున్నాఁడో యనునట్లు దేవతల సంపదకు ఆస్పదమయి యెప్పుడును ఏ జన్మము నెత్తిన వాఁడైన శ్రీవిష్ణుమూర్తి పొట్టి బ్రహ్మచారి రూపమును ధరించి వినోదముగా సంచరించెను. 26 సుగమము.

27 కుఱుమట్టపుఁబొట్టివడుగు—కుఱుచ వాఁడును మట్టసమయిన అవయవస్ఫురణ గల వాఁడు నైన చిన్న వాఁడు: 28 సుగమము 29 సుగమము

30 వెడ వెడనడకలు-మెల్లమెల్లనినడకలు ఎడ నెడన్—నడుమనడుమ అడుగిడఁగన్ అడుగుపెట్టుటకు, అడరి—ప్రయత్నపడి, ఇలన్—భూమియందు. దిగఁబడుచున్—జాఱిపడుచు. బుడిబుడి నడుపులు—తత్తఅపుమాటలు, చిడిముడిపడన్—తొట్రు పడునట్లు, వడుచువడుగు—బాల బ్రహ్మచారి.

తా॥ బాల బ్రహ్మచారియయిన వామనుఁడు మెల్లమెల్లగా నడుచుచు అట్లు నడుచునప్పుడు నడుమడుమ జాఱి నేలఁబడుచు తత్తఅపుమాటలాడుచు తొట్రుపడువానివలెనే మెల్లగాఁబోయి రాజు దగ్గఱఁజేరెను.

31 మాయాభిక్షుకుండు—కపట బ్రహ్మచారి ( వామనుఁడు ) రక్షోవల్లభుంజూచి రాక్షసరాజైన బలిచక్రవర్తి నిజూచి. 32 సురలోకేంద్ర—దేవేంద్రుఁడు, కాల-యముఁడు, ఆది—మొదలుగాగల దిక్పతి—దిక్పాలురచేత, అపనయ—తొలగించుటయందు, పరివర్తి—పరివర్తించువాడు, గత—పోయిన, లోభ—పిసినితనముయొక్క—స్ఫూర్తి ప్రకాశముగలవాడు నానా-అనేకములయిన, మఖ-యజ్ఞములయందు ప్రసవణ—ఆసక్తులయినవారిని, అనువర్తి—అనుసరించి వర్తించినవాఁడు. సుమనః దేవతలయొక్క, రామా—భార్యలయొక్క, మనః-మనస్సును, భేదన—భేదించుటయందు, చంద్రాతప—వెన్నెలమైన, కీర్తి-యశస్సు గలవాఁడు, సత్య-నిజముచేత

కరుణా-దయచేతను, ధర్మ-పుణ్యముచేత, ఉల్లసత్-ప్రకాశించుచున్న, మూర్తి ఆకృతిగల దానవచక్రవర్తి-రాక్షసులకు చక్రవర్తి, ( బలి ) ఇతఁడే ఇతఁడేనా తా॥ దేవేంద్రుఁడు అగ్ని యముఁడు దిక్పాలకుల గర్వమును అణుచునట్టివాడును పిసినితనము లేనివాఁడును, అనేకములైన యజ్ఞములను వ్రతములను నడుపువాఁడును, దేవాధిపతులను ఎడఁబాపుటచేత వారి భార్యల మనసులకు తాపమును పుట్టించునట్టి వెన్నెలనుబోలిన కీర్తి గలవాఁడును, నిజము, దయ పుణ్యము వీని చేత వెలుఁగుచున్న యాకృతి గలవాఁడైన బలిచక్రవర్తి యితఁడేనా యని అడిగెను. 33 సుగమము. 34 జగత్త్రయీ-మూడు లోకముల సముదాయమయిన, భువనశాసనకర్తకున్-లోకమును శిక్షింపఁగర్తయయినవానికి హాసమాత్రిన-వ్వమాత్రముచేతనే, విధ్వస్త-మిక్కిలి బెదరింపఁబడిన నిలింపభర్తకున్-దేవేంద్రుఁడు గలవానికి. ఉదార-ఇచ్చువానిదైన. పద-స్థానము, వ్యవహర్తకున్-వ్యవహరించువానికి. మునీంద్ర-మునిశ్రేష్ఠులచేత స్తుత-పొగడఁబడిన మంగళ-శుభకరములయిన అధర్వ-యజ్ఞములయొక్క. వితాన-సమూహమునందు నిర్జరీ-దేవతాస్త్రీలయొక్క గళ-మెడలయందు న్యస్త-ఉంచఁబడిన సువర్ణసూత్ర-బంగారు త్రాళ్లయందలి మణి-రత్నములను-తాలిబొట్టులను, హర్తకున్-అపహరించువానికి. తా॥ స్వర్గ మర్త్య పాతాళముల నెడి మూడులోకముల ప్రజలను శిక్షించువాఁడును, నవ్వుచేతనే బెదరింపఁబడిన యింద్రుఁడు గలవాడును, దాత్మస్థానమునందుండి వ్యవహరించువాడును, మునిశ్రేష్ఠులు శ్లాఘించునట్టి గొప్ప యజ్ఞములను నడుపువాడును, దేవతాస్త్రీల తాలిబొట్లను అపహరించువాడును, రాక్షస సమూహమునకు రాజైన బలిచక్రవర్తికి మేలు గలుగును గాక. 35 కరచరణాద్యవయవంబులు-చేతులు కాళ్ళు మొదలయిన అవయములు వేద...బోలె-తాల్చిన వేదపు ప్రోగువలె అకుటిలుండును-వంకర నడక లేనివాడై, జటిలుండును-జడలు గలవాడును పదండచ్ఛత్రుండును-మోదుగు కఱ్ఱతోడను- గొడుగుతోడను గూడినవాడును కక్షలంబిత-చంకయందు వ్రేలిన. కరకలిత...లుండును-చేతియందున్న నీటి మట్టిపాత్రము గలవాడును, మనోహరవదనచంద్రమండలుండును-అందమయిన ముఖమనెడి చంద్రబింబము గలవాడును, మాయావాదనటుండును-కపటవాదముచేత నటించువాడును, దినకరకిరణపిహితంబులు-సూర్యునియొక్క కిరణ

ము లచేత కప్పఁబడినవి. చందంబున-అయినట్టి తిరోహితులయిన—మఱుగువడిన ఉనిచి—కూర్చుండబెట్టి తన ప్రాణవల్లభ—తన ప్రియురాలు పసిండికలశంబువన్ బంగారుచెంబుతో, వడుగు కొమరుని చరణంబులు- బ్రహ్మచారి చిన్నవాని యడుగులను. 36 సుగమము 37 సుగమము 38 తా॥ ఓ బ్రహ్మచారీ! నీ ఎవఁ చిన్నవాఁడవు నీపేరేమి నీవు ఉండుచోటు ఏది నీవు వచ్చుటచేత నా కులమును జన్మమును సఫలముమాయెను. నేను కృతార్థుఁడయితిని. నా యజ్ఞము సార్థకమాయెను. నాకోరికలన్నియు నెఱవేరెను. లోకములన్నియు మిత్రములాయెను. ఈ సమయమును మంచిదాయనెను. 39 ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! నీవు నన్నిప్పుడు అడుగ వచ్చినవి మంచి వస్త్రములా ధనమా అడవి సంబంధమైన వస్తువులేవైననా ఆవులా గుఱ్ఱములా రత్నములా తేరులా లేక అన్నివస్తువులునా కన్యకలా ఏనుగులా బంగారమా ఇండ్లా ఊళ్లా భూములా భూమండలమునందేదయిన అడుగవచ్చితివా నీయిష్టమైనది యేదైనను అడుగుము ఇచ్చెదను. 40 వైరోచని వచనంబులు-బలిచక్రవర్తి మాటలు. 41 నెలవు—ఉనికిపట్టు, వక్కాణింతును—చెప్పుదును, పూని—ప్రయత్నపడి. మువ్పోకలన్—మూడువిధములైన మార్గములచేతను, నేరువులన్నియున్—అభ్యసింపవలసిన విషములన్నియు, సిరియున్—లక్ష్మియు, ఒరులు—ఇతరులు. తా॥ ఓ మహారాజా! నేనొక చోటనుండుటయను నిశ్చయము లేక సర్వాంతర్యామినై యుందును. గనుక ఇది నివాసస్థానమని యొక తావును నిర్ణయించి చెప్పుటకు వల్లకాదు. నాకంటె అధికుఁడు మఱియొకడు లేకుండుటచేత నాకు నేనే పెద్దనై వర్తింతును గనుక నేను ఒకరి చిన్నవాఁడను అని చెప్పుటకు సరి పడదు. నేను మూడు విధములైన నడవళ్లుగలిగి మెలఁగుచుండువాఁడను, గనుక నానడవడి యిట్టిదని చెప్పుటకు వల్లపడదు. నేను సర్వవిద్యలను సర్వకార్యములను సర్వప్రవర్తనములను నేర్చినవాడను గనుక ఈవిషయము నేను నేర్తును అవిషయమును నేను నేర్తును అనిచెప్పను అనుకూలింపదు. లోకమునందు నాకు సహాయులొకరు లేరు. నేను అందఱికును సహాయుఁడనైయుందును. నేను ఒంటరినేగాని నాకు చుట్టములు ఎవరును లేరు పూర్వకాలమునందు, సంపద ఉండెను యిప్పుడు లేదు అయినను నానివాసస్థానమును అడిగితివి

చెప్పెదను నేను సజ్జనులయందే తఱచు గాఁజొచ్చియుందును ఇంతకంటె నాకు నిశ్చయమయిన యునికిపట్టు ఏదియు లేదు ( ఇట్లు చెప్పుటచేత వామనుడు తన సర్వాంతర్యామిత్వ సర్వాధిక్యత్వ సర్వశక్తిత్వ సర్వరక్షకత్వ సర్వాతీతత్వ స్వస్వైశ్వర్యత్వములను వివరించెనను విషయము తేటపడుచున్నది. )

42 సుగమము. 43 కులార్హంబు—నీకులమునకు దగినది, వితరణభీరువులు—పాత్రిమెఱిఁగి యిచ్చుటయందు పిఱికితనము గలవారును, ప్రత్యర్థులు—పగవారు అర్థులై యాచకులై, ప్రిబ్బికొనగన్—నిందించుకోఁగా. అధికులై—దొడ్డవారై, దానశౌండులు—మిక్కిలి యిచ్చువారు, తనపుదురు—తృప్తినొందింతురు మేటి మగలు=ఉత్తమశూరులు, మింటి—ఆకాశమునందు,రుచులన్—కాంతులచేత,భువదీయవంశంబు=మీకులము. నీరరాశిభంగన్—సముద్రమువలె, నెగడచుండున్ —అతిశయిల్లుచుండును, తా॥ ఓబలిచక్రివర్తి! నీమాటనిజమును సత్పురుషులు శ్లాఘించునదియు మీకులమునకు దగినదియు ధర్మముతోఁగూడినదియు నైయున్నది. మీవంశమునందు దయగలవారును ధర్మాత్ములును పుట్టుదురు గాని ఇతరులు పుట్టరు. యుద్ధమునకును దానము చేయుటకును వెఱచువారు మీకులమునందు లేనే లేరు. మఱియు మీకులమునందుఁబుట్టిన వారు పగవారైనను యాచకులైవచ్చి తమ్మునిందించుకొనుచుండఁగా మిక్కిలి యిచ్చునట్టి గుణము గలవారై వారిని తృప్తినొందింతురు. మీపెద్దలందఱును మిక్కిలి శూరులు. వారిలో మీతాతయైన ప్రహ్లాదుడు ఆకాశమునందు చంద్రుడు వెలుగునట్లు వెలుగఁగా మీవంశము సముద్రమువలె అతిశయిల్లుచుండును.

44 సుగమము. 45 సుగమము 46 సుగమము 48 దానకుతుకసాంద్ర=ఇచ్చుటయందలి వేడుక చేత అధికుఁడవైన బ్రహ్మకూఁకటి=బ్రహ్మతలను తా॥ యాచకులకు ఇచ్చుటయందు మిక్కిలి వేడుకగల యో బలిచక్రవర్తీ ! నేను ఒంటరివాడను నాకు ధనమునందు అపేక్ష లేదు. మూడడుగులకొలది భూమిమాత్రము నాకుగావలెను. దానితో నేను తృప్తినొందెదను అదిమాత్రమిమ్ము.

48 సుగమము 49 బ్రాహ్మణుడా! నీవు చెప్పిన మాటలన్నియును యుక్తములుగానేయున్నవి నీనడవడియును పెద్దలు ఒప్పుకోదగినదిగానున్నది. అయినను నీవు అడిగినదిమాత్రము సరిగానుండలేదు. నావంటివానిని అంత అల్పదా

నమును అడుగవచ్చునా? అయ్యో తనకు ఇచ్చ లేకున్నను గౌరవమును సమృద్ధిని-
జూచి యయిన అందులకుఁ దగినట్టు అడుగునక్క— ఇచ్చువానికి లేదాయనెను
50 వసుధాఖండము-భూఖండమును, వాజులన్-గుఱ్ఱములను వెసన్-వడిని గూర్చి
ఈవు=నీవు అసురేంద్రుఁడు=అసురులకు రాజైన, పదత్రయంబు-మూడడుగులు
తా॥ ఓబ్రహ్మచారీ! నీవు భూఖండమును అడిగితివా లోకములను అడిగితివా
వడిగా నడుచునవియని గుఱ్ఱములనేమయిన నడిగితివా స్త్రీలను జూచి యడి
గితివా ఇట్టివానినెల్లను వదలి వసివాడవు గనుక అడుగుటకుఁ దెలియక మూ
డడుగుల నేల యడిగితివి నీవు తెలియక ఇట్టియల్పదానమును అడిగినను
బలిచక్రవర్తి మహాదాత యనఁగాఁ బ్రసిద్ధి నొందిన నేను ఏ విధముగా ఇత్తును
అనియడిగెను. 51 గృహమేధికిన్ — గృహస్థుఁడయినబలితోడ మేధావి—వా
మనుఁడు 52 ముంజియో-ధర్భమొలత్రాడో వామాక్షుల్=స్త్రీలు కరులు=
ఏనుగులును మదాకాంక్షామితంబు-నాకోరికకొలది తా॥ ఓబలిచక్రవర్తీ! నేను
బ్రహ్మచారిని నాకుఁగావలసిన గొడుగు జందెము కమండలువు దర్భమొల
త్రాడు మోదుగుకఱ్ఱ ఇవి యేవైన అడుగవచ్చునుగాని ఏనుగులు గుఱ్ఱములు
స్త్రీలు భూఖండములు ఇవియన్నియు నాకేల. వానికి నాకును ఎంతదూరము.
నాకు ప్రతిదినమును తప్పక చేసికోఁదగిన వైదికకర్మములను జేసికొనుటచాలును
కనుక నేనిప్పుడు అడిగిన మూడడుగుల కొలఁది భూమియు లేదనక యిచ్చితి
వేని అదియే ఈబ్రహ్మాండమంతయు నిచ్చుటగా నెంచి సంతోషించెదను అని
చెప్పెను. 52 సుగమము 53 ఆశాపాశము-ఆశయనెడి త్రాడు, వారాశి—సము
ద్రముచేత, పరివృత—చుట్టబడిన, మేదినీవలయ-భూమండల సంబంధమయిన
వైన్యగయభూకాంత-పృథుచక్రవర్తి, గయ మహారాజు, ఆదులున్-మొదలగు
వారుగూడ, గాసిన్-శ్రమమును, పాయఁగనేర్చిరే—వదలఁజాలిరా. నిజాశాంత
ములన్-తమయాశలతుదలను. తా॥ రాజశ్రేష్ఠుఁడయిన బలీ ఆశయనెడి త్రాడు
మిక్కిలి నిడుపయినది దానికి తుద లేదు కనుకనే మునుపు పృథుచక్రవర్తి గయ
మొదలగు రాజులు సముద్రముచేత చుట్టబడిన భూమండలమంతయు తమకు
లభించినను, తృప్తినొందక మనఆశకిది తుదయని తెలిసికోఁజాలక శ్రమపడిరి
గాని సుఖమును పొందినవారు కారు. 54 సుగమము 55 ఖర్వునకు-చెప్పుచున్న

వామనునికి, ఉర్వీశ్వరుండు-రాజు (బలి)కర...శుండు—చేతియందుఁబొందిన నీటి చెంబు గలవాఁడు వితరణగరిష్ఠుండు-దానముచేయు గుణముచేత మిగులదొడ్డ వాఁడు తా॥ బలిచక్రవర్తీ! ఇతఁడు దేవతల పనిని సాధించుటకై యదితి కడు పునఁగశ్యపునకుగాఁబుట్టిన విష్ణుదేవుఁడు గాని కేవల బ్రాహ్మణుఁడు కాఁడు. నీవు ఈసంగతి తెలియక కోరిన దానినిచ్చెదనని చెప్పితివే ఇందువల్ల నీకును నీ వారికిని ఉపద్రవము వచ్చును. ఎట్లనఁగా ఇతఁడు సర్వమున నిండుకొను నంతటి దొడ్డ దేహము ధరించిన వాఁడయి మూఁడడుగుల చేతనే మూఁడు లోకములును ఆక్రమించుకొనును అట్లు సమస్తమును పోఁగొట్టుకొని పిమ్మట దరిద్రుని వలెనీ వెట్లు బ్రతుక గలవు. 57 సుగమము 58 వారిజాక్షులందున్—స్త్రీలు విషయమునందు, వైవాహికములందున్—పెండ్లిండ్లయందును. చకిత...మందున్—భయపడిన గోసమూహము యొక్కయు, అగ్రజన్మ-బ్రాహ్మణుల యొక్కయు, తా॥ ఓబలిచక్రవర్తీ! స్త్రీలతోపరిహాస మాడునపుడును పెండ్లియెడఁగూడని యెడల నొడగూర్పవలసినపుడును ప్రాణముగాని మానముగాని ధనముగాని పోవునట్టియెడల పోకుండ నిలుపవలసినప్పుడును భయపడిన బ్రాహ్మణుని ఆవుల మందను కాపాడువలసినప్పుడును అబద్ధము చెప్పవచ్చును=పాపము కలుగనేరదు.

|| ఈకుబ్జుండు-ఈపొట్టివాఁడు, వదాన్యోత్తమా—దానమిచ్చువారిలో నుత్తముఁడవైన, విశ్వంభరుండు—శ్రీవిష్ణుదేవుఁడు, అలతిన్-అల్పముతో, త్రివిక్రమ స్ఫురణ వాఁడై—మూఁడడుగులుగాఁగొలిచి యాక్రమింపఁదగిన యాకృతిని వహించిన వాఁడై. తా॥ ఓమహాదాతవగు బలిచక్రవర్తీ నీవు నీకులమును ప్రభుత్వమును ప్రతాపమును, చెడక నిలుపు కొనుము: ఈ పొట్టివాఁడు సాధారణ బ్రాహ్మణ కుమారుఁడు కాఁడు లోకము నెల్లభరించు నట్టి శ్రీవిష్ణుదేవుఁడు. ఇతఁడు నీవిచ్చెడు కొంచెము పుచ్చుకొని పోవు వాఁడు కాఁడు. మూఁడులోకములను మూఁడడుగులుగాఁగొలవఁజాలిన యాకృతిని వహించి బ్రహ్మాండంబును నిండుకొనును. అప్పుడతని నణఁచుఁడెవ్వఁడును లేఁడు. కనుక నామాటలు విని దానము గీనము నియ్యక యీ బ్రహ్మచారిని ఊరక పంపుము.

60 సుగమము 61 సుగమము 62 తా॥ ఓ శుక్రుఁడా! ఇదివఱకు ఈ భూమికి నావంటి వారెందఱో రాజులైనారు ప్రభుత్వమును చేసినారు గాని వారు

నేము రాజులను మాకంటె స్వతంత్రులెవరును లేరని గర్వించి యథేచ్ఛము
గాఁబ్రవర్తించిన వారు కారు. కాకున్నను వారు పోవునప్పుడు తాము చేర్చి పెట్టిన
ధనము మొదలయిన వానిని మూటకట్టుకొని పోయినవారు కారుకదా, వారి
పేరైన నీభూమియందు వినఁబడదు. అట్లుగాక కీర్తి నపేక్షించి అడిగినవారికి అడి
గినట్లు ఇచ్చిన మహాదాతలగు శిబి మొదలగువారు చనిపోయి చిరకాలమైనను
వారికీర్తి లోకమునందు అంతట వ్యాపించి యున్నందున నీకాలమునందుఁగూడ
జనులువారిని దాతలని పొగిడుచు నేయున్నారు. కనుక నేనిత్తునన్న దాని నియ్యక
లుబ్ధత్వమును వహింప నేరను.

63 సుగమము 64 శ్రీసతి–శ్రీలక్ష్మీదేవియొక్క, అంసోత్తరీయంబుపైన్-మూ
పు నందలి పయ్యెటమీదను, పాదాబ్జంబులపైన్-పాదకమలముల మీదను
కపోలకటిపైన్_చెక్కిటి ప్రదేశము మీదను, పాలిండ్లపైన్—స్తనములమీదను
చెందుకరంబు—పొందునట్టిచేయి. తా॥ మొదట శ్రీలక్ష్మీదేవియొక్క కొప్పు
మీదను పిమ్మట క్రమముగా దేహము మీఁదను మూఁపునందలి పైట మీ
దను, పాదముల మీదను, స్తనముల మీదను, మేలయిన సన్మానముతో వ
ర్తించిన శ్రీవిష్ణుదేవుని చేయి క్రిందైనా చేయి మీఁదౌట మిక్కిలి విశేషము
కాదా అట్టి గౌరవము వచ్చునపుడు అశాశ్వతమైన ప్రభుత్వమును ఎప్పుడో
చెడునదియై యుండెడి యీ శరీరమును నమ్మి జంకవచ్చునా.

65 కులాంతమైన-వంశనాశనమైన, నీరజభవుండు—బ్రహ్మయైనను.

తా॥ ఓ పండితోత్తముఁడవైన శుక్రాచార్యా! నామాట వినుము. ఈ దానమి
చ్చుటవలన నరకము కలిగినను వదలని యిక్కట్టు కలిగినను సర్వస్వము నశిం
చినను చెడ్డచావు కలిగినను వంశము నశించినను నాకు సత్యమే లభింపనిమ్ము
ఇప్పుడు శివుఁడుగాని విష్ణువుగాని బ్రహ్మగాని ఎవరు అథితులై వచ్చినను నేను
చెప్పిన మాటను తప్పను నీవేలయెన్నో నీతిమాటలు చెప్పెదవు ఊరకయుం
డుము. అని బలిచక్రవర్తి చెప్పెను.

66 సుగమము 67సుగమము 68 సుగమము 69 సత్యపదవీ...రుండును-సత్య
మార్గముయొక్క మేరయందాసక్తుఁడును, వితరణ....రుఁడును-ఈవియందలి
వేడుక వలన వేడిగలవాడును, అర్థిజనకమలకమల బంధుడును—యాచక జన

ములనెడి కమలములకు సూర్యుఁడును. మదీయ శాసనంబు—నాయాజ్ఞను. అన్యత మార్గంబునకున్—అసత్యపుదారికి. అభిముఖుండు గాక—ఎదురుగాక.

70 తా॥ తమ బ్రతుకు చెడినను పలువిధముల నిర్బంధములు గలిగినను పేద, ఱికము వచ్చినను జీవనములు చెడిపోయినను, మానవంతులగు పురుషులు మాటదిరుగ లేరు. 72. రాజవదన—చంద్రుని వంటి ముఖము గలదియు మదమరాళగమన—మదించిన హంస నడవంటి నడగలదియు. నాథుదయిత—రాక్షససమూహమునకు రాజైన బలి యొక్క భార్యయునైన. వర హేమఘట మునన్—శ్రేష్ఠమయిన బంగారు కుండతో. 76. జలజాతాక్షుఁడు—తామరల వంటి కన్నులు గలవాఁడైన వామనుఁడు. బలిదైత్యేంద్ర—రాక్షసరాజైన బలి యొక్క. కరద్వయీ—రెండు చేతులతోను. ప్రక్షాళన—కడుగుట యొక్క యోగి...శ్రీదమున్—యోగాభ్యాసము చేయునట్టి మునులచేతను. సుమనః దేవతలచేతను, సంప్రార్థిత—వేఁడఁబడిన. శ్రీదమున్—సంపద నిచ్చునదియు కలిత—కూడిన, అస్రమ—అంతటను పంగిన, రమా—లక్ష్మీదేవియొక్క, లలాట తటీ—నొసటిమార్గమునందలి, శాతమున్—బురదగలదియును, నళినామోద మున్—కమలములపరిమళమువంటి బరిమళముగలదియును, రత్న.... వేదమున్ రత్నములయందెలుగఁజేయఁబడిన పలు వేదములు గలదియునైన

తా॥ వామనావతారమెత్తిన శ్రీవిష్ణుమూర్తి యోగీశ్వరులచేతను, దేవతల చేతను, అడుగఁబడిన కలుముల నిచ్చునట్టిదియు మిక్కిలియడకువతో నమస్కరించి శ్రీలక్ష్మీదేవియొక్క నొసటి బొట్టువలని కస్తూరి సంటినదియు కమలములపరిమళము వంటి పరిమళము గలదియు రత్నాలయందెలుగా నాచరించుచున్న వేదసమూహముగలదియు నైన తనపాదమును కడుగఁగోరిన బలిచక్రవర్తి తట్టునకుఁజాచెను. 77 అసురోత్తముడున్—బలిచక్రవర్తియు, నిరతశ్రీకరణ మున్—శాశ్వతమయిన సంపదకు సాధనమయినదియు, అఖిల....కరణమున్—ఎల్లవేదాంతములకును అలంకారమయినదియు. భవసంహారణమున్—జన్మములను మాన్పుటగలదియునైన. తా॥ అట్లుచాఁచఁబడిన దేవతాసమూహమును ద్ధరించునదియు శాశ్వతమయిన సంపదకు సాధనమైనదియు వేదాంతములకు నలంకారమయినదియు జన్మదుఃఖములను దొలగింపనదియునైన వామనుని పాదమును బలిచక్రవర్తి నీళ్లుపోసికడిగెను. 78 ధరణీసుర దక్షిణ చరణప్రక్షాళ

వంబు—బ్రాహ్మణుని కుడిపాదముయొక్క కడుగుటను.
79 ప్రకట వ్రతాయ—ప్రసిద్ధమైన వ్రతముగలవాడును. విప్రాయ—బ్రాహ్మణుడు నైన భవతే-నీకొఱకు. వేదప్రామాణ్యవిధేః_వేదశాస్త్రములందు చెప్పబడిన విధమువలన దాస్యామి—ఇచ్చెను. తా॥ ప్రసిద్ధమైన వ్రతములు నడుపునట్టి విష్ణుస్వరూపుఁడగు బ్రాహ్మణుఁడవయిన నీకొఱకు వేదప్రమాణము చొప్పున మూడడుగులభూమిని ఇచ్చితిని అని చెప్పి బలిచక్రవర్తి తక్కిన యజ్ఞసంబంధమైన క్రియలవలనఁదొలగింపఁబడినవాఁడై అనఁగా ఆక్రియలనెల్ల వదలి వామని పూజించి లోకులెల్ల నిట్టి దాత గలఁడాయని తన్నుఁజూచి యాశ్చర్యపడుచుండగా బ్రహ్మార్పణ మని నీళ్లు చేతిలోఁబోసికొని వామనునికి దత్తము చేసెను. 80 సుగమము 81 సుగమము 82 అమరారాతిశిరోత్కరో.. శ్రేణికిన్ బలిచక్రవర్తియొక్క చేతినుండి చెడనిదై విడువఁబడిన పరిశుద్ధమయిన నీటిబొట్లయొక్క పఙ్క్తికి, ఖండిత—నఱకఁబడిన, దివౌకస్స్వామిజిత్—దేవేంద్ర శత్రువులయిన రాక్షసులయొక్క, మస్తమున్—తలలు గలదానిని. కమలాకర్షణసుప్రశస్తమున్—లక్ష్మిని ఆకర్షించుటయందు శ్లాఘ్యమయిన దానిని. రమాకాంతాలకాపాస్తమున్—లక్ష్మీదేవి తలయొక్క పాడివెండ్రుకలమీఁదనుండిజాఱిన దానిని విమత... స్తమన్—శత్రువులయొక్క సంపదయనెడి లక్ష్మీదేవి స్తనములయొక్క వాఁడులైన మొనలమీద ఉంచబడినదానిని. తా॥ బలిచక్రవర్తిచేతినుండి విడువబడిన పరిశుద్ధమయిన నీళ్లబొట్లచాలునకు వామనుడు రాక్షసుల తలలను నఱుకునదియు శ్రీలక్ష్మీదేవియొక్కకొప్పువలననుండి జాఱినదియు శత్రువుల సంపద నాకర్షించుటయందుంచబడినదియు నైన తనచేతినిజాచెను.
83 జనిత—పుట్టిన, అసురయువతి—రాక్షసస్త్రీలయొక్క తా॥ ముని జనులయొక్క వ్రతాది నియమములకు ఆధారమయినదియు రాక్షసస్త్రీలకు కన్నీళ్లు కలిగించునదియు రాక్షసశ్రేష్ఠులకు కత్తి వాదరవంటిదై బాధను కలుగజేయునదియునై బలిచక్రవర్తి చేతవిడువఁబడిన జలధారను వామనుడు గ్రహించెను.
84—90 సుగమము 91 గ్రహ—నవగ్రహములయు, సిద్ధ—సిద్ధులు, పక్షి—పక్షులయు, అహి—సర్పములయు, దేవతూర్యకోటి—దేవతల వాద్యసమూహము 92 సుగమము 93 నభోవీధిపైన్—ఆకాశము మీఁద, తోయదమండలాగ్రముకునన్—మేఘమండలముమీఁదికి, సత్యపదోన్నతుండు—సత్యలోక స్థానముచ

కంటె పొడవైనవాఁడు. తా॥ ఆబ్రహ్మచారి కొంచెము కొంచెముగాఁ బెరుగుచు ఆకాశమునంటి,యూమీఁద క్రమముగా మేఘమండలమును మేరు శిఖరమును సూర్యమండలమును ధ్రువమండలమును మించునట్లు పెరిగి సత్యలోకస్థానము గూడ మించి బ్రహ్మాండమంతయు తానే నిండుకొన్నవాఁడై యొప్పెను.

94 శ్రవణాలంకృతమై—చెవి పోఁగై, గళాభరణమై—మెడకుఁదగినసొమ్మై కటి స్థలిన్—నడుమునందు. ఉదంచత్-ఒప్పుచున్న, నూపురమై—శ్రేష్ఠమయిన యందమై, తా॥ వామనుడు బ్రహ్మాండమంతయు నిండుకొనునట్లు పెరుగు నప్పుడు క్రమక్రమముగా సూర్యుఁడు అతనికి గొడుగువలెను, తలయందలి రత్నము వలెను చెవిపోగువలెను, మెడలోని హారమువలెను, బంగారుతోఁజేసిన భుజకీర్తుల వలెను, ప్రకాశించుచున్న ముంజేతి కడియము వలెను నడుమునఁగట్టుకొఁబడిన వస్త్రమువలెను కాలియందెవలెను, కాలుంచుకొనెడి పీట వలెను పోల్చి చెప్పుటకుఁదగియుండెను.

95 గుణత్రియాత్మంబగు—రజస్సత్వ తమస్సులనెడి మూడు గుణములు గలది నభంబును-ఆకాశమును, దివియును—స్వర్గమును, భువియును—భూమియును చలత్-చలించుచున్న, ఉచ్ఛ్రితంబై—పొడువై, ఇఱుముఁలు— మఱుఁగుచోట్లు చరణతలంబునన్-కాలియందలి, మహీయున్-భూమియును,జంఘులన్-పిక్కల యందు, మహీంద్రంబులును—కొండలును, జానువులన్-మోకాళ్లయందు, పతత్రిసముదయంబులును—పక్షులసమూహములును, ఊరువులన్=తొడలయందు ఇంద్రసేన మరుద్గణంబులును—బలిచక్రవర్తియును దేవతా సమూహములును గుదంబునన్-ముడ్డియందు, గుహ్యంబునన్ — పురుష చిహ్న స్థానము నందు ఉదరంబునన్=కడుపునందు ఉదధిసత్కంబును—సముద్రము లేదును ఉరంబునన్ ఱొమ్మునందు, జఘనంబునన్-పొత్తికడుపునందు, నయనంబులన్-కన్నులందు పృష్ఠంబునన్—వీపునందు, రసనన్—నాలుకయందు, జలేశుండును-వరుణుఁడును భ్రూయుగళంబునన్ — కనుబొమ్మల జంటయందు, అజుండును-బ్రహ్మయు గాత్రంబునన్-దేహమునందు, జలధరనినదశంఖ ... తుండును=మేఘముయొక్క ధ్వనివంటి ధ్వనిగల శంఖము, విల్లు, సుదర్శనమనెడి చక్రము, గుదియకత్తి కత్తి, తఱుగని బాణములు;అమ్ములపొదులు వీనిచేత ప్రకాశించువాఁడు. మకర కుండల—మొసలియాకృతి గలచెవిపోగులు, కటక—అందెలు, మేఖలా—మొల

నూలు, అంబర-వస్త్రములు, వనమాలికా-తోమాల, సునంద... ప్రముఖ-
సునందుఁడు, నందుడు, జయుడు, విజయుడు, మొదలయిన సేవకులతోఁ తను,
సందోహ-సమూహము తోడను, చుట్టుకోఁబడిన వాఁడును, అసమాన తేజోవిలసి
తుండును-ఈడులేని తేజస్సుచేత వెలుఁగువాఁడును, తనమేని-తన దేహము
96 తా॥ సర్వలోకములకు ప్రభువైన శ్రీవిష్ణుదేవుఁడు ఒకయడుగున భూమినిమఱి
యొక యడుగున ఆకాశమును నాక్రమించి మూడవ యడుగును జాచి యది
పట్టక కొప్పెర వంటిదయిన బ్రహ్మాండము పగిలి తాపము కలిగింపగా ఎల్ల
మొడలను తానొకఁడే గాని యితరులెవరును గానరాకుండునట్లు అవాఙ్మాన
సగోచరుఁడై విశ్వరూపముతో నొప్పెను. 97 ఉర్వీ-భూమి, త్రివిక్రమమునన్
విష్ణు మూర్తి మూడులోకముల నాక్రమించుటచేత. తా॥ ఓ పరీక్షిన్మహారాజా
విష్ణుదేవుడు విశ్వరూపమును ధరించి మూడులోకముల నాక్రమించు నపుడు
ఆవిష్ణుదేవుని యొక్క భూమి మీదనుంచిన పాదమునకు క్రింద కొంచెము బు
రద యంటు కొన్నట్లు భూమియు మీది కెత్తిన రెండవ పాదమునకు మీద
తామర నాశ్రయించిన తుమ్మెద విధమున ఆకాశమును గానవచ్చెను.

99 తా। ఎల్ల లోకములను దాటిపోయిన త్రివిక్రమదేవుని కాలి గోళ్లు చంద్ర
బింబముల వలె వెలుఁగుఁగా వానివలని వెన్నెలవలె వెలుఁగు చున్న కాంతు
లచేత దీపము యొక్క ప్రకాశము సూర్యప్రకాశముచే మాటుపడినట్లు సత్య
లోకమునందలి చతుర్ముఖ బ్రహ్మయొక్క తేజస్సు మాటుపడి ప్రకాశింపని
దయ్యెను. 100 భవబంధములన్-జన్మ బంధములనుండి. అమరీచ్యాదులును-
ప్రసిద్ధులైన మరీచి మొదలగు తొమ్మండ్రు బ్రహ్మలును, సర్వాధిపునంఘ్రిన్
సర్వేశ్వరుఁడైన త్రివిక్రముని పాదమును, తా॥ అప్పుడా త్రివిక్రమదేవుని పాద
మును జన్మదుఃఖములు తొలఁగఁగా బ్రహ్మలోకమునందు వాసము చేయు
చున్న రాజులు మరీచి మొదలుగాఁగల నవబ్రహ్మలును పర్వత నారదాదు
లైన దేవమునులును, అక్కడ నెల్లప్పుడు ఆకృతులు వహించి వర్తించు నట్టి
పురాణములు తర్కము మొదలగు శాస్త్రములు వేదములు ఇతిహాసములు
మొదలగునవియును, ఇంకను జ్ఞానవంతులై యెల్లకర్మములను పరిత్యజించి
వర్తించునట్టి పెద్దలును ఒక్కటిగాఁగూడివచ్చి చూచి తమ మనసులలో నెల్ల

ప్పుడు తలపఁబడు చుండెడి నిధియయిన శ్రీమన్నారాయణుని పాదకమలము లను జూచి నేము ధన్యులమయితిమని అనుకొనుచు మిక్కిలి భక్తితో మొక్కిరి. 102 అజుఁడున్—బ్రహ్మయు, పంకేరుహంబున్— బొడ్డుతామరను. విశ్వాత్మ కీర్తిప్రభన్ — సర్వస్వరూపుఁడైన త్రివిక్రమదేవుని కీర్తియొక్క ప్రకాశమువంటి ప్రకాశముతో 105 పదత్రయ వ్యాజంబునన్ = మూడడుగుల నేలయును నెపముచేత, అప్రతిహత తేజఃప్రభావంబునన్-అడ్డములేని తేజస్సుయొక్క మహిమచేత, ఇజ్జగంబులన్—ఈలోకములను, వాసవునకున్-ఇంద్రునికి,నిర్జించుట=గెలుచుట, కర్జంబు—కార్యము, తర్జనంబులన్—బెదిరింపులను వజ్రాయుధ మరుజ్జేతలు=ఇంద్రుని తక్కినదేవతలును గెలిచినవారు, సునంద ...సాత్వతులు-సునందుఁడు నందుడు జయుడు జయంతుడు ప్రబలుడు, ఉబ్బలుడు, కుముదుడు, కుముదాక్షుడు, తార్క్ష్యుఁడు, పుష్పదంతుఁడు విష్వక్సేనుఁడు శ్రుతదేవుడు, సాత్వతుండును, అను దండనాథులు—అను పేళ్లుగల సేనానాయకులు, అయుత వేదండసమబలుఁలు—పదివేల యేనుగుల బలముతో సమానమైన బలము గలవారు, దానవానీకంబులన్-రాక్షససేనలును.

106 ఓరాక్షస శ్రేష్ఠులారా! మీరిప్పుడు విష్ణుసేవకులతో యుద్ధము చేయఁబోకుడు. ఇదివారతో యుద్ధము చేయఁదగిన సమయము కాదు. లోకమునందు ఎల్లప్రాణులకును మేలు కీళ్లు కలిగించునట్టి దేవుఁడే మనల నవమానింపఁగా మన మాయవమానమును తప్పించుకొఁగలమా. ఏదేవుడు మునుపు మనకు రాజ్యమును దేవతలకు చెఱుపును కలుగఁజేసెనో ఆదేవుడే యిప్పుడు మనకు చెఱుపును దేవతలకు ప్రభుత్వమును కలుగఁజేయ ప్రయత్నించెను. అట్లుండగా ఇదిమన యదృష్టబలముగాని యితరముకాదని యెంచక యట్టి సమబుద్ధి గల దేవుని నిందించుట సరికాదు. మునుపు మనలను జూచి భయపడి పాఱిపోవుచున్న విష్ణుసేవకులు ఇప్పుడు ధైర్యముతో మనల నెదిరింపఁబూనుట మన యదృష్టబలమే కనుక మన యదృష్టము మంచిదైనప్పుడు మనము పగవారి జయింతము. ఇప్పుడు ఏసంకటములు వచ్చినను ఓర్చుకొని యోరక యుండుడు. అని బలిచక్రవర్తి నముచి మొదలగు రాక్షసులతోఁజెప్పెను. 107_108 సుగమము 109 రణంబునన్—యుద్ధమునందు, మోహరించుట=వ్యూహము పన్నినిలుచుట,

భాగవత భటభీతులై-భగవంతుని సేవకులైన భటుల వలన భయపడినవారై రసాతలంబునకున్-పాతాళలోకమునకు, యాగసుత్యాహంబునన్-యాగమునం దలి సోమపాన దినమునందు, అసురవల్లభునిన్-రాక్షసరాజును 110 సుగమము 111 సుగమము 112 తా॥ ఓబలీ! నీవు మూడడుగుల నేల యిచ్చెదనని చెప్పితివి. సూర్యచంద్రులప్రకాశము ఎంతవఱకుఁగలదో అంతపర్యంతమయిన నేల యంతయు ఒక యడుగు ఆయెను. స్వర్గలోకమంతయు ఒక యడుగు ఆయెను. ఇఁక మూడవ యడుగున కెక్కడనైన చోటున్నదా. ఎవఁడు తానిచ్చెద నన్న దానము నియ్యఁజాలని వాఁడౌనో వాఁడు నరకమును పొందును గదా కనుక నీవు మూడవ యడుగు నేలను ఇచ్చినపద్దతికి పోయెదవో లేదని కొంతకాలము నకు నరకమునకుఁబోయి యుండెదవో చెప్పుము. ఇచ్చెదు పక్షమున శీఘ్రము గా ఇమ్ము. బ్రాహ్మణుల యధీనమయిన సొత్తునుతప్పించుటకు బ్రహ్మ గూడ నేరడు కనుక నీవు నేనిప్పుడు చెప్పిన రెండువిధములలోనొకవిధమునకు ఒప్పు కొని తీరవలెను. 113 సత్య... యుండయ్యెను-నిజమునకుభంగ చెఱుపు వచ్చె ననెడి సంశయముచేత కప్పఁబడి ఖేదమునొందినమనస్సుగలవాడు. విషాదము నొందినవాఁడు. ( విషాదము-ధనహాని మొదలయిన వానిచే నేమియుఁశోచ కుండుట ) 117 విభ్రంశచక్షువులు-ఉన్నత స్థానమునుండి జాఱుట యనెడి చూపులు వెలయన్-ప్రకాశించునట్లు, నిర్జరారులు-దేవశత్రువులైన రాక్షసులు తా॥ ఓ వామనమూర్తి లోకమునందు తల్లితండ్రి అన్నదమ్ముఁడు స్నేహితుఁడు ఆచార్యుడు అను నిట్టి చుట్టములు దండించుట పిమ్మట మేలు కలుగుటకే గాని కీడు కలుగుటకుఁగాదు. కనుక దానివలన కొఱఁత రానేరదు. అధికమయిన మదము చేత కన్నుఁగానక మెలఁగునట్టి రాక్షసులయిన మాకు సమయము చూచి ఐశ్వర్యమును తొలఁగించుటయను చూపును కలుగఁజేసి గుడ్డితనమును పోగొట్టుదువు. గురువులకందఱకు మొదటి గురువవైననీవ్వునన్ను కట్టుటచేత నాకు అవమానము సిగ్గు చెఱుపు దుఃఖము అనునవి కలుగునా కలుగనే కలుగవు. పూర్వకాలము నందు అనేకులు రాక్షసులు నీతో ఎదిరించి పోరాడి ఆనంద స్వరూపులై ఆది యోగులైన సనకాదులు పొందునట్టి యుత్తమ స్థానమును పొందలేదా? పొందనే పొందిరి. విరోధమో భక్తియో ఒకటి కలిగి నీమనసుంచి యుండవలెగాని అట్లున్నయెడల నీయందు పొందరా

నిది యేదియు లేదు. 119 సంసేవార్థికే—తనకొలువుగోరువారే. తా॥ నున్న నుస్నేహితుడే స్నేహితుడు చుట్టమే యమధర్మరాజు తన కొలువుడు కాండ్రేయమకింకరులు కనుక తానుశాశ్వతుఁడుకాఁడు ప్రాణము అశాశ్వతమే. ఈసంగతి తెలియక తెలివిమాలినవాడు సత్యము దానము దయ ధర్మము లేనివాఁడై మాయారూపమయి అశాశ్వతమయిన సంసారమును శాశ్వతముగా నెంచి చెడును. 119 తా॥ ఓ విష్ణుమూర్తి చుట్టములు దొంగలవలె దొరకినదానిని తీసికొనిపోవువారును కొడుకు అప్పులవారివలె నానా విధములకష్టపడి సంపాదించిన ధనమును తీసుకొనువారును పెండ్లాలు లేనిపోని సంబంధము పెంచుటకు నిమిత్తమయిన వారును నైయున్నారు, సామాన్యులయిన యితర జనులు తమకార్యము నపేక్షించి దగ్గఱ జేరువారు. ఎన్నివిధములనో కష్టపడి చేర్చునట్టి ధనమన్ననో అస్థిరమయినది. ఇన్నిటికి సాధనమయిన దేహము మిక్కిలి చలించునట్టిది. ఆయస్సును అతిశీఘ్రముగా కడచునది సంపదలు నిలుకడకలవి కావున ఇది యంతయుఁదెలిసియే యోగ్యులయందు త్తముఁడయిన మాతాత ప్రహ్లాదుఁడు నీపాదపద్మములను నియమముతో నాశ్రయించెను. కనుక నేను పరిశుద్ధుఁడైన చావులేని బ్రతుకుకలిగెను. అతనికిమునుపటివారైన మాపెద్దలందఱును విరోధులయ్యేకాని మఱియొక విధము చేత నిన్నుబొందినవారు కారు. అట్టు మాపెద్దలకందఱకును పగవాడవైన నీవు నాయందు పగ పెట్టకొక యాచకుడవై వచ్చి నన్ను యాచించుట నేను చేసికొన్న పుణ్యముయొక్క ఫలమేకదా అని వామనునితో పలికెను.

121 పీనవక్షున్—బలిసిన. నవపద్మాక్షున్-క్రొత్త తామరలవంటి కన్నులు గలవానిని, పీతాంగాంబరాచ్ఛాదున్— పీతాంబరము చేత కప్పబడిన వానిని. ఘనసంసారాగ విచ్ఛేదున్—దొడ్డదైదృఢమయిన సంసారమనెడి వృక్షమును నఱుకుటగలవానిని సంశ్రీదున్—మేలైన కలిమి నిచ్చువానిని భక్తిలతాపాదున్—భక్తియనెడి తీగచేత మఱుఁగు పఱుపఁబడిన శ్రీవిష్ణుదేవుని పాదములు గలవానిని. నిఃఖేదున్—ఖేదము లేనివానిని. తా॥ ఆబలిచక్రవర్తి విశాలమయిన మొగు ఱొమ్ముగలవాడును, క్రొత్తగా వికసించిన కన్నులుగలవాడును, పీతాంబరమును ధరించినవాడును, కపటములేని మంచిమాటలాడువాడును, సంసారబంధమునుండి విడువబడినవాడును, మేలైన కలిమి నిచ్చువాఁడును, విష్ణుదే

వుని పాదములయందు భక్తిగలవాడును, దుఃఖము లేనివాడును, విశేషము జ్ఞానము గలవాడును, నైన ప్రహ్లాదుని తన యెదుట గాన రాఁగా సంతోషముతోఁ జూచెను. 122 వారుణపాశబద్ధుండు=వరుణ సంబంధమయిన త్రాళ్లచేత కట్టబడినవాడు, సంకులాశ్రువిలోలచనుండై=నిండుకొన్న కన్నీళ్లచేత చలించుచున్న కన్నులగలవాడై, నతశిరస్కుండై=వంపబడిన తల గల వాడై నమ్రభావంబునన్=వంగినతనముతో. 123 తా॥ నీవు బలిచక్రవర్తికి మునుపు దేవేంద్రాధికారమును కలుగఁజేసి యిప్పుడు దానినంతయు నపహరించితివే యిది మిక్కిలి మేలు. ఆయధికారము తానధికుఁడను అజ్ఞానమును కలుగఁజేయుటకు కారణము కాగా ఆయజ్ఞానము వలన యహంకారము హెచ్చి కటికచీకటి యాక్రమించినట్లు ఆక్రమించి కన్ను గానరానియ్యదు అట్టి యధికారమువలన గలిగెడి చీకటిని తొలగించి కట్టివేయుట రక్షించుటయేగాని కట్టుటకాదు. పరతత్త్వము నెఱింగినవానికి ఇంద్రాధికారమెందుకు. ఆ యింద్రాధికారమువలన గలిగెడి భోగములెందుకు అభోగములు నీయడుగులను సేవించుటవలన గలుగునట్టి యానందానుభవమును బోలునా? పోలునేపోలదు కనుక గర్వమెచ్చుటకును కన్నులు కానరాకపోవుటకును మనసునఁగలఁత పుట్టించుటకును నీకొలువును మఱచుటకును తన చేరవమును తొలగించుటకును నాధారమయిన యీయధికారమును పోగొట్టి నీసంబంధమయిన సేవాధర్మమనెడి యీగొప్పమర్యాదను కనబఱచి యితనికి మేలుచేసితివి. 125 తతమత్త ద్విపయానయై=మిక్కిలి మదించిన యేనుఁగు యొక్క నడకవంటి నడక గలదై, కుచనిరుంధచ్చేల. సంవ్యానయై-కుచ=స్తనములను, నిరుంధత్-అడ్డగించుచున్న, చేల-అవికయు, సంవ్యానయై-పైటయుఁ గలదై. ధృతబాష్పాంబువితానయై-ధరింపబడిన కన్నీళ్ల సమూహము గలదై. కరయుగాధీనాలిక స్థానయై-రెండు చేతులను జోడించి చేర్చుకొన్నదై. తా॥ అప్పుడా బలిచక్రవర్తి పెండ్లామయిన వింధ్యావళి మదపుటేనుఁగు నడకవంటి నడకతో అవికచేతను పైటచెఱగుటచేతను స్తనములు కప్పుకొనుచు కన్నులనీళ్లు క్రమ్మఁగా ఓమెత్తని మనసు గల లక్ష్మీప్రియుఁడా! నాకు పతిభిక్షయిమ్మని నొసట చేతులుంచి మ్రొక్కుచు మూడులోకములను రక్షించువాడైన శ్రీవామనదేవుని దగ్గఱకు వచ్చెను. 129 తా॥ "అయమాత్మా సర్వేషాం భూతానామధి

పతిః" అండే జాతాని భూతాని స్థావరాణి చరాణిచ । విబుధేభ్యః పరస్తస్మై
"శక్తాత్పర తరశ్చయః । శివాత్పరతరో బ్రహ్మ బ్రహ్మణః పరమో హరిః" అను వేదవ
చనములు చెప్పగ ఎల్లప్రాణుల నేలిన వాడును ఎల్లప్రాణుల తలంపైన వా
డును దేవతలకు దేవుడును లోకములకు దొరయు దేవతలకు మ్రొక్క దగిన
వాడును అయిన శ్రీవామనమూర్తీ! తనకు గల ధనమంతయు నీకిచ్చిన దాత
యగు బలిచక్రవర్తి నీకు రక్షింపఁదగినవాడు గాని శిక్షింపఁదగినవాడు కాఁడు
ఇప్పుడు యితని భయము దీర్చి కట్లనుండి విడిపింపుము. నీపాదములు కడిగి
నిన్ను బూజించి నీకు భక్తుడైన యితడు ఇంద్రపదవిని గోరివచ్చిన విష్ణుమూ
ర్తివి నీవని తెలిసియు నీవు తన యెదుట నిలిచి వేడగా తన రాజ్యమంతయు
నిచ్చెను. ఇటువంటి దొడ్డవాఁడు ఈగట్టి త్రాళ్ళకట్లు పడఁదగినవాఁడగునాయనెను

131 తా॥ నేనువేపురుషుని రక్షింపఁగోరుదునో వాని ధనము నెల్లను వంచించి
పుచ్చుకొందును. ఏపురుషుడు భార్య బిడ్డలతోడి యునికిచేత అధికమయిన క్రొ
వ్వుగలిగి మూఢత్వముతో లోకుల నెల్లను నిందించి నన్ను దిరస్కరించు చుం
డునో ఆమనిష్యుడు ఎల్లప్పుడు నానావిధ జాతు రూపములతోఁబుట్టి నరకము
లను బొందుచుండును. ఎవడు ధనము వయస్సు చక్కదనము చదువు దేహ
బలము బహువిధైశ్వర్యములు దొడ్డపనులు ఉత్తమ వంశ జన్మము మొదల
యిన వాని వలన గర్వింపక యెప్పుడు నొకరీతిగానే అడకువ గలిగి వర్తించునో
అటువంటి పురుషుడు నాకు ప్రేమతో రక్షించుటకు దగినవాడు అట్లునాకు
ప్రీతిపుట్టింపజాలినవాడు ఎప్పుడును చలింపక యుండు వస్త్రభూషణాద్యలంకా
రములవలన కాంతివల్లనగు గర్వమును వహించి దేహము తెలియక మెలగు
చు చెడిపోవ యత్నింపడు. శాంతిని వహించి మేలునే పొందగోరును.

132 తా॥ ఈబలిచక్రవర్తి నాచే కట్టబడినవాడును, తన గురువుచే శపింపఁ
బడినవాడును, తనరాజ్యపదవినుండి తొలగింపఁబడినవాడును, చుట్టములచేత
విడువబడినవాడును తనకు గలిగియున్న సంపదనెల్ల పోగొట్టుకొని వైభవము
చేత తక్కువైనవాడును, దరిద్రుడై, నిరల్పుడై నిజము తప్పక కరుణమానక
విశ్వాసము చెడక యెచ్చరిక నొందినవాడై గెలువ శక్యము గానిదైన నామా
యను గెలిచెను. కనుక ఈపుణ్యాత్ముడు దొడ్డవాడుగాని కొంచెగాఁడుకాఁడు

138 తా॥ ఓబలిచక్రవర్తీ నీకు మేలు గలుగును భయపడకుము. నీ దాన

త్వము శ్లాఘ్యమయినది. అసుతల లోకమునందు దేవతలు కూడ ఉండ గోరు దురు. ఆలోకమునందుండువారికి దుఃఖములు, ఆపదలు, చెడ్డచావులు, వ్యాధిబాధలు, నొప్పులు అనునవి కలుగవు కనుక నీవు అందు ఉండుము. అచ్చట నీయుత్తరువును మీరునట్టి రాక్షసులను నాచక్రము వచ్చి నఱుకు చుండును. కనుక దిక్పాలకులకుఁగూడ నీవు జంకనక్కఱలేదు. ఇఁక తక్కిన వారెంతటివారు. నీవు ఆలోకమునందు సుఖముగానుండునెడల నేను సిన్ను నీతో గూడ ఆలోకము నందుండు వారిని కాపాడుచు నీకు ప్రత్యక్షమయి వర్తించుచుండెదను 140 తా॥ ఓ శేషశాయీ! ఎప్పుడును దిక్పాలకులను సయితము దయతోఁ జూడని నీవు నేటి దినము నన్నుఁబొగడి నేను బ్రతుకు విధమును జెప్పి కాపాడితివి. ఈ సన్మానమును ఈ దయతోడి పెద్దఱికపుమా టల గౌరవమును చాలదా? ఇటువంటి నిన్ను తెలిసి ఆశ్రయించిన వక్షి మున ఆపదలే కలుగ నేరవు. 141 ఇందు ధరునకున్=శివునికి. 142 చతురా నుడు=బ్రహ్మ. శర్వుఁడు=శివుడు, ఈ లక్ష్ములజాడ=ఈ కలిముల మార్గమును తా॥శుభ స్వరూపుఁడవైన యో స్వామీ! బ్రహ్మయును శివుడును నీవు మా విషయమునఁజేసిన యనుగ్రహమును ఐశ్వర్యమును పొందినవారుకారు. ఇఁక ఇతరులకు అది యెక్కడిది. అట్లుండగా రాక్షసులమయిన మాకు బ్రహ్మ మొదలయిన వారిచేత బూజింపఁబడిన యడుగులుగలవాడవును, మాకోం ట్లకు పొందరానికోటకావలివాడవైతివి. బ్రహ్మమొదలగువారును నీపాదపద్మ ములవలన మకరందపానముచేయుట వల్లనైన మహిమచేతనే ఐశ్వర్యమును పొందినవారేగాని యితర మహిమ చేత పొందినవారుకారు. కనుక అల్పబు ద్ధులమును అధిక దుష్టశీలులమును కుత్సితపు మనసు గల వారము నయిన మేమునీదయాస్థానమును చేరుటకు ఎటువంటితపస్సు చేసితిమో తలంపఁగలమా ఇట్లుమమ్ముగాపాడుట మిక్కిలి యాశ్చర్యముగానున్నది. 146 వలగొని=ప్రద క్షిణముచేసి, కరక....తటుండై=చేతులనెడి తామర దొప్పల చేతఁ గూర్చ బడిన నొసటి ప్రదేశము గలవాడై, 148 తా॥ఓ యజ్ఞపురుషుడవైన వాసునా ఎల్లపనులకును అధికారియు యజ్ఞమునకు ప్రభువునునీవు. ధనము దేశము కా లము అందులకుఁదగిన వ్యాపారము మంత్రము వీనియందలి కొఱతలు నీపేరు తలచినంత మాత్రముననే తీఱుచుండగా నీవు కనుల యెదుట నిలిచి తృప్తి

వహించి యుండునెడ ఏపనులకైనను కొఱతలు ఏలకలుగును. కలుగనే కలుగవు. కనుక నేను నీయాజ్ఞను నడపెదను. నీయాజ్ఞచొప్పున మెలగునట్టి జనులకు మేలు కలుగును కదా. నీయాజ్ఞచొప్పున నడచుకొనుటకంటె నాకు మేలెక్కడ కలుగును. అని పలుకుచు శుక్రుడు విష్ణుదేవుని యాజ్ఞను శిరసావహించి మునులయొక్కయు బ్రాహ్మణులయొక్కయు తోడుపాటుతో బలిచక్రవర్తియొక్క యజ్ఞము కొఱతను పూర్తిగ నెఱవేర్చెను. 154 తా॥ దేవతలకెల్లఁ దల్లియైన యదితి కానుపులుడుగు నప్పుడు మనోహరుఁడై సమర్థుఁడై యొప్పునట్టి వామనునిగన్న విధమున సమర్థుఁడైన కొడుకును ఒక్కనిఁగన్నను జాలును. అట్లు సమర్థులుకాని కొడుకుల నేకలు కలుగుట కడుపు బరువు సకే గాని మఱియే విధమయిన యుపయోగము కొఱకునుగాదు.

155 తా॥ ఓ పరీక్షన్మహారాజా! శ్రీవిష్ణుదేవుని మహిమ ఇట్టిదని తెలిసి చెప్పను తలఁపను ఏవరు చాలుదురు. భూమి దుమ్ములలోని నలుసులను ఎంచి యెన్నిగాని తెలిసికొజాలని వాడుగూడ అతనిమహిమ తెలిసికొనఁజాలఁడనగా ఇతరులెంతమాత్రము వారు. 156 తా॥ ఏమనుష్యుడు ఆశ్చర్యపునడవడిగల శ్రీ విష్ణుదేవుని మంచి చరిత్రములను వినునో ఆమనుష్యుడు అణపరాని పరాక్రమముచే వెలయుచుండి తుదను మేలైన యుత్తమ పదవులను పొందును.

157 ఓ రాజా! ఏమనుష్యుల యినను ఎక్కడ నైనను మనుష్యుల కొఱకును పితృదేవతలకొఱకును, దేవతలకొఱకును. తాము చేసెడి పనుల సమయముల యందు శ్రీ త్రివిక్రముడయిన విష్ణుని పరాక్రమమును వర్ణించి పలుకునెడల శాశ్వతమయిన సుఖమును అనుభవించువారగుదురు.

సమాప్తము.



# వేగుంజుక్క గ్రంథమాల.

## శ్రీరామప్రెస్, పూడిపెద్దివారివీథి, బరంపురం - గంజాం

## శ్రీమదాంధ్రతులసీరామాయణము.

జగద్గురు మహాత్మాగాంధిగారిచే కొనియాడఁబడిన అతిపవిత్ర గ్రంథము. శ్రీతులసీరామాయణము. లాధామహారాజను బ్రాహ్మణుఁడను నిత్యనిష్ఠు హా గ్రంథము పారాయణముఁజేసి తనకు సంభవించిన దారుణ కుష్ఠురోగము నుండి విముక్తి బొందినట్లు కలియుగ సత్యహరిశ్చంద్రుఁడగు మహాత్మాగాంధి గారుద్ఘోషించియే యున్నారు.

ఇట్టిమహాగ్రంథము తేటతెనుగున కడుమనోహరశైలిని బ్రి॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారిచే వ్రాయబడి వేగుఁజుక్క గ్రంథమాలనుండి 10 భాగములుగా వెలువడినవి—బాలకాండము-2-0-0, అయోధ్యా కాండము 2 భా॥ లు -2-8-0, అరణ్యకాండము 1-4-0, కిష్కింధాకాండము 1-4-0, సుందర 1-4-0, దూతాంగదము 1-4-0, కుంభకర్ణవధ 1-4-0 అహిరావణవధ 1-4-0, పట్టాభిషేకము 2-0-0. ( నరాంతకవధ, రావణవధ—భాగము )

ఈ భాగములన్నియు ఒకసారి కోరిరేని మూడు గ్రంథములు ఉచితముగా నొసంగ బడును:—1 దుఃఖవిమోచనము, విజ్ఞాన కందశతకము, శ్రీజగన్నాథస్తబకము. ఖర్చులు కొనువారివే. రూ 2/ అడ్వాన్సుతో ఆర్డరు పంప వలెను.

☛ డిటెక్టివ్ నవలలు, నవలలు, శతకములు, శృంగార గ్రంథములు. నాటకములు. మొదలగు ననేక గ్రంథములు వెలువడినవి.

వలయువారికి మానిందు కేటలాగు పంపఁబడును

గ్రంథములన్నియు ఒకసారి కోరినయెడల తగిన "కన్సెషన్" ఒసంగఁబడును, వేగుఁజుక్క గ్రంథమాలనుండి ప్రచురింపఁబడిన చాల గ్రంథములు పాఠశాలలకు యోగ్యములని మదరాస్ టెక్స్టుబుక్ కమిటివారు ఎప్రూవ్ చేసినారు. దయయుంచి పాఠశాలాధికారులు, ఉపాధ్యాయులు, గ్రంథభాండాగారస్థాపకులు ప్రోత్సహింప వలసినదని ప్రార్థించుచున్నారము.

గమనింపుఁడు:—వలయువారు పైచిరునామాకు మాత్రమే వ్రాయవలెను.